# తొలిమాట

ఎన్నికల పండగ వచ్చింది, వెళ్ళిపోయింది. అయితే, ఒక చిన్న తేడా. మామూలుగా మన పండగలు ఏటా వస్తాయి. ఎన్నికల పండగ అయితే అయిదేళ్ళ కొకసారి. మామూలు పండగలు వచ్చి వెళ్ళిపోయాక, వాతావరణం నిస్సారంగా, నిర్జీవంగా, చప్పగా వుంటుంది. ఈ ఎన్నికల పండగ అలాకాదు. ఒక నెల రోజులుముందునుంచి దేశంలో గొప్ప సంచలనం బయలుదేరుతుంది. ఎన్నికల వారం రోజులు ఆ సంచలనం అపూర్వంగా, పతాక స్థాయిని అందుకుంటుంది. ఎన్నికలు పూర్తి అయిన తరవాత: నెల, రెండు నెలల వరకు కూడా సంచలనం ఏమీ తగ్గదు.

గెలిచిన వారు తిరుపతి వెళ్ళి మొక్కు చెల్లించుకు రావడం, వారికి ఊరేగింపులు, సన్మానాలు అలా వుంచండి. అసలు కథ అప్పుడే మొదలవుతుంది. మెజారిటీ సంపాదించిన పార్టీలోని ప్రతి ఎం. ఎల్. ఎ. కి దేశసేవ చేయాలనే కోరిక లోపల మెదులుతూనే వుంటుంది. కనీసం డిప్యూటీ దేశసేవకైనా అవకాశం రాకపోతుందా అనే ఆశ తహతహ లాడిస్తుంది. ఇక మొదలవుతాయి బేరాలు, రాయబారాలు, ఊహాగానాలు, ఆశాభంగాలు. ఆశా తరంగాలు !

ఇదంతా చూస్తుంటే ప్రజలకు ఎంతైనా వినోదం, మానవ మనస్తత్వాన్ని గురించి బోలెడు విజ్ఞానం.

వాటికి తీసిపోని వినోద, విజ్ఞానాలను పాఠకులకు అందజేయడమే "జ్యోతి" ఆశయం ఇక చదవండి.

వెంకట్రావు ఉప్పాల్ (signature)



ఇప్పుడు హెర్క్యులిస్ కొన్నాడు

"హెర్క్యులిస్ కొనడానికి కష్టపడి కూడ బెట్టాను. ఆ 'హ' ఎంత మంచి పెట్టుబడి! ఎప్పుడూ ఇంట్లో నమ్మకమైన భాగస్వామి.

## సైకిలు జీవితాంతం ఉపయోగపడుతుంది హెర్క్యులిస్ మీ సొత్తుకు మంచి విలువైనది

విశిష్టమైన రకము, మితమైన వెలతో హెర్క్యులిస్ బైసికిళ్ళలో ఆదర్శమైనది. వింతమాత్రము ఆశ్చర్యము లేదు. ప్రపంచమంతటా 135 దేశాలలో ఎక్కువగా అందరూ వాడేదే ఇది. సౌత్ ఈస్ట్ ఏషియాలో మద్రాసు నందు మంచి సాధన సదుపాయాలు కలిగిన పెద్ద సైకిల్ ఫ్యాక్టరీలో అంతర్జాతీయపు అర్హతలకు అనుగుణ్యంగా తయారుచేయబడింది. హెర్క్యులిస్ ప్రపంచంలో పెద్ద సైకిళ్ళ ఉత్పత్తిదారులైన ట్యూబ్ ఇన్వెస్ట్మెంట్స్ లిమిటెడ్, యు.కె. వారి సౌజన్యంతో ఖచ్చితముగా నిర్మింపబడినది.



వెల విశిష్టత ఎన్నిక మన్నిక అందము-అన్నిటిలోను హెర్క్యులిస్ సొమ్ముకు మంచి విలువైనది.

# ® హెర్క్యులిస్ -

ఒక్క సైకిలే
కాదు జీవితకాలపు నేస్తము



® ది హెర్క్యులిస్ సైకిల్ మరియు మోటర్ కంపెనీ లిమిటెడ్ యు కె వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు ఇండియాలో తయారీ; టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు మద్రాసు 53 ప్రొప్రైటర్లు ట్యూబ్ ఇన్వెస్ట్మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ మద్రాసు 1 ఉపయోగించుటకు రిజిస్టరుకావింపబడిరి. చిన్న మొత్తముల శేకరణలలో ఆదా చేయండి

TIC/H/3822A




**సచిత్ర మాసపత్రిక**

బకింగ్‌హామ్ పేట పోస్టు

విజయవాడ-2

విడిప్రతి వెల

**80 పైసలు**

ఏడాది చందా

**9-50 రూపాయలు**

**సంపుటి 5**

**మార్చి 1967**

**సంచిక 3**

మేనేజింగ్ ఎడిటర్

**వి. వి. రాఘవయ్య**

# ఉచితం!

## అందమైన, ఎవర్ సిల్వర్ టీ స్పూను




ప్రతీ ఒక్క సరికొత్త, పుష్టికరమైన గ్రానులర్



**ఓవోమాల్ట్** డబ్బాలోను

సంపూర్ణమైన ఈ ఆహార పానీయాన్ని మీరు సేవించండి.
దీనితోపాటు లభించు విలువైన కానుకను కూడా పొందండి.

తయారు చేయువారు :
ఫుడ్స్ ఫాట్స్ & ఫర్టిలైజర్స్ లిమిటెడ్,
తాడేపల్లిగూడెం, ఆంధ్రప్రదేశ్.
విక్రయాల విభాగం :
115-బి, నేతాజీ సుభాస్‌చంద్రబోస్ రోడ్డు, మద్రాసు-1.

* ఈ స్కీము సరుకు నిల్వలో
ఉన్నంతవరకే అమలులో వుంటుంది.

# అంతానికి ప్రారంభమా ?




ఇంగ్లీషులో "ఇ టీజ్ ది బిగినింగ్ ఆఫ్ ది ఎండ్" అంటారు. దీనికి సరియైన తెలుగు స్ఫురించక "అంతానికి ప్రారంభం" అనవలసి వస్తున్నది. నిజంగానే ఇది ఇరువదేళ్లుగా దేశాన్ని పాలించిన కాంగ్రెసు ప్రభుత్వాల ఏకచ్ఛత్రాధిపత్యం అంతానికి ప్రారంభోత్సవమేనా ?

ప్రతిసారి జనరల్ ఎన్నికలలో కొన్ని వింతలు, ఆశ్చర్యాలువుండడం మామూలే. అయినా, ఎన్ని ఆశ్చర్యాలకు సిద్ధంగా కూర్చున్నవారికైనా షాక్‌కొట్టి, కూర్చున్నవారు లేచి నిలుచునేట్టు చేశాయి ఈసారి ఎన్నికలు.

ఆశ్చర్యకరమైన ఎన్నికల ఫలితాలలో కేరళ ఒకటికాదు. అక్కడ నాన్ - కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడక తప్పదని అంతా అనుకుంటున్నదే. ఇప్పుడు అలాగే జరగబోతున్నది కూడా. కాంగ్రెసుకు, తిరుగుబాటు చేసిన కేరళ కాంగ్రెసుకు ప్రతిపక్షంగా వ్యవహరించడానికి కూడా చాలనన్ని తక్కువస్థానాలు వచ్చాయి. ఏడు పార్టీలు కలిసిన యునైటెడ్ ఫ్రంటు అధిక స్థానాలు పొంది ప్రభుత్వం ఏర్పరచ బోతున్నది. వీరిలో మార్క్సిస్టు కమ్యూనిస్టులదే ఎక్కువబలం కనుక మిశ్రమ ప్రభుత్వంపై ఆధిపత్యం వారిదే అవుతుంది.

ఆశ్చర్యం కలిగించిన ముఖ్యమైన ఫలితాలు మద్రాసు రాష్ట్రానివి. కాంగ్రెసుపట్ల అన్నిరాష్ట్రాలలోను సామాన్యంగా వుంటున్న ఏవగింపే అక్కడా వున్నదని, డి. ఎం. కె. పార్టీకి పూర్వంకంటె ఎక్కువ స్థానాలు రావచ్చునని అంతా అనుకున్నారు. కాని, కాంగ్రెసు ఇంత ఘోరంగా, సమూలంగా తుడిచిపెట్టుకు పోతుందని ఎవ్వరూ ఊహించలేదు. డి. ఎం. కె. పార్టీ మరే ఇతర పక్షాల సహకారం లేకుండా స్వయంగానే ప్రభుత్వం స్థాపిస్తున్నది. మరొక అయిదేళ్ళ వరకు అది మద్రాసులో చెక్కు చెదరదు. కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజ్, కేంద్రమంత్రులు సుబ్రహ్మణ్యం, అలగేశన్‌లతోసహా కాంగ్రెసు పూర్తిగా పరాజయం, పరాభవం కూడా పొందింది. ఈ ఫలితాలు డి. ఎం. కె. నాయకులకు కూడా ఆశ్చర్యం కలిగించాయి.

పోతే, ఉత్తరాదిన జనసంఘం

బ్రహ్మాండమైన విజయాలుపొందింది. ఢిల్లీ లోక్ సభసీట్లు, మెట్రోపాలిటన్ కౌన్సిల్ సీట్లు దాదాపు అన్నీ అదే గెలుచుకున్నది. మిగతారాష్ట్రాలలో దానిబలం పూర్వంకంటె హెచ్చింది.

ఒక్క జన సంఘం ఏమిటి? దాదాపు ప్రతి ప్రతిపక్షం ఉత్తరాది రాష్ట్రాలలో పూర్వంకంటె ఎక్కువ స్థానాలు ఆక్రమించుకున్నది.

పంజాబులో కాంగ్రెసుకు మెజారిటీరాలేదు. రాజస్థాన్ లో, యు.పి. లో అంతే. పశ్చిమబెంగాల్ లో ప్రతిపక్షాల మిశ్రమ ప్రభుత్వం తప్పనిసరిఅని స్పష్టమైంది.

రాజస్థాన్ లో ఇండిపెండెంట్లను కలుసుకుంటే కాంగ్రెసు ప్రభుత్వాన్ని ఏర్పరచవచ్చు. పంజాబు యు. పి. లలో పరిస్థితి ఇంకా అనుమానంగా వుంది.

ఒరిస్సాలో కాంగ్రెసు పొందిన ఘోర పరాజయం ఫలితంగా స్వతంత్రపార్టీ, జన కాంగ్రెసు కలిసి ప్రభుత్వం ఏర్పరచడానికి ప్రయత్నిస్తున్నాయి. బీహారులో ఎస్. ఎస్. పి. చాలా స్థానాలు సంపాదించింది. కాంగ్రెసుకు విడివిడిగా మిగతాపార్టీలకంటె ఎక్కువ స్థానాలు వచ్చినప్పటికీ, ప్రభుత్వం ఏర్పరచడం కష్టం

---

బహుశా మిగతా పార్టీలు అన్నీ కలిసినా మిశ్రమ ప్రభుత్వం ఏర్పరచడం కూడా కష్టమే. చివరికి, రాష్ట్రపతి పాలన, తిరిగి ఎన్నికలు బీహారులో తప్పవేమో.

కాంగ్రెసు తనకు తాను స్వయంగా ప్రభుత్వాలు ఏర్పరచగలిగిన రాష్ట్రాలు ఏడు మాత్రమే వున్నాయి. అవి ఆంధ్రప్రదేశ్, అస్సాం, మైసూరు, మహారాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, హర్యానాలు.

కేంద్రపాలిత ప్రాంతాలైన త్రిపుర, హిమాచల్ ప్రదేశ్ లలో కాంగ్రెసు ప్రభుత్వాలే ఏర్పడుతున్నాయి.

అంటే — అడపాతడపా కొన్ని చోట్ల మిశ్రమ ప్రభుత్వాలు, రాష్ట్రపతి పాలన, ఒక్కసారిమాత్రం (కేరళలో) కమ్యూనిస్టు ప్రభుత్వం మినహాయిస్తే అవిచ్ఛిన్నంగా 1949 నుంచి కాంగ్రెసు ప్రభుత్వాలనుతప్ప మరొకటిఎరగనిఇండియాలోఇప్పుడు మొదటిసారిగా వివిధ రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయన్నమాట. ఇది చరిత్రా

త్మకమైన పరిణామం. భారతదేశం ప్రజాస్వామ్య జీవిత విధానానికి అలవాటు పడుతున్నదనడానికి ఇది తార్కాణం.

పోతే కేంద్రంలో కాంగ్రెసు వరవాలేదన్నట్టుగా విజయం పొందింది. పూర్వంకంటె చాలాతక్కువ స్థానాలను (ఇదివరకు 364) సంపాదించినమాట నిజమే. 521 స్థానాలను కాంగ్రెసు 278 స్థానాలను కాంగ్రెసు ఇంతవరకు సంపాదించింది. ఇది విజయం కాని విజయం. కేంద్రంలో ప్రభుత్వాన్ని స్థాపించడానికి కాంగ్రెసుకు ఈ మెజారిటీ చాలుననుకోండి. అయినా, దాని పని దిన దినగండంగా వుండక తప్పదు. ప్రతిపక్షాల ఉధృతం ఎక్కువౌతుంది. ముఖ్యంగా ప్రతిపక్షాలలో అగ్రశ్రేణి పార్లమెంటేరియన్లు చాల మంది గెలిచారు. కానికాంగ్రెసులో కేంద్ర మంత్రులలో ప్రముఖులైన వారు, పార్టీసభ్యులలో ముఖ్యులైన వారు చాలామంది ఓడిపోయారు. దీనితో కాంగ్రెసు పని చాలా ఇరుకున పడక తప్పదు. ప్రతిపక్షాలు తమ జోరు ఎక్కువచేస్తే గట్టిగా సమాధానం చెప్పగల నాధుడు కాంగ్రెసులోలేడు. ప్రధానమంత్రి పదవికి పోటీవుంటుందా? ఎవరు పోటీచేస్తారు? ఎవరు ఎన్నికవుతారు? రాష్ట్రపతి పదవి పూర్వం నామ మాత్రంగా వుండేది. ఇప్పుడు ఇండియా రాజకీయ స్వరూపం, కేంద్రంలోను, రాష్ట్రాలలోను మారిపోవడంతో రాష్ట్రపతి ప్రాముఖ్యం హెచ్చుతుంది. అందుచేత ఆ పదవికి ఎవరు ఎన్నికవుతారు? ఇవన్నీ వేచిచూడాలి.

పోతే, మన రాష్ట్రంలో ఎన్నికలైపోయాయిగా? ఇక పదవులవేట, పంపకాలవద్ద తగాదాలు మళ్ళీ ప్రారంభమవుతాయి!

***

---

**వచ్చే సంచికలో**

**సుప్రసిద్ధకవి, కథారచయిత**

**కీర్తిశేషులు**

## బాలగంగాధరతిలక్

**అముద్రిత కథానిక**

## పరివర్తన

## యాజమాన్యం తదితర వివరాలు

# "జ్యోతి"

ఫారం 4 (8 వ నిబంధన ప్రకారము)

| | | |
|---|---|---|
| ప్రచురణ స్థలం | : | విజయవాడ. |
| ఎంతకాలానికొకసారి | : | మాసపత్రిక. |
| ముద్రాపకుని పేరు | : | వి. వి. రాఘవయ్య, |
| జాతి | : | భారతీయుడు, |
| విలాసము | : | బకింగ్‌హామ్‌పేట పోస్టు, విజయవాడ —2 |
| ప్రకాశకుని పేరు | : | వి. వి. రాఘవయ్య, |
| జాతి | : | భారతీయుడు, |
| విలాసము | : | బకింగ్‌హామ్‌పేట పోస్టు, విజయవాడ —2 |
| సంపాదకుని పేరు | : | వి. వి. రాఘవయ్య, |
| జాతి | : | భారతీయుడు, |
| విలాసము | : | బకింగ్‌హామ్‌పేట పోస్టు, విజయవాడ —2 |
| పత్రిక యజమానులు | : | శ్రీమతి లీలావతి బకింగ్‌హామ్‌పేటపోస్టు విజయవాడ —2 |

పై విషయాలు నాకు తెలిసినంతవరకు వాస్తవమైనవని తెలియ జేయుచున్నాను.

విజయవాడ —2,
తే. 1—3—67

(సం) వి. వి. రాఘవయ్య

# విముక్తి

ఆ రోజంతా బోనులోని పులిలా పచార్లతోనే గడిచి పోయింది గంగులికి. బయట చీకట్లు అలము కొంటున్నకొద్దీ అతని ఆలోచనలో కూడా అంధకారం వ్యాపించింది. దుర్భేద్యమైన జైలు కిటికీ ... అప్పుడప్పుడు మెరుపులు ... మళ్లీ గాఢాంధకారం ... వానజల్లులు. గంగులు విధిని తిట్టుకుంటూ ముఖం మీద తడిని తుడుచుకున్నాడు.

ఐదు సంవత్సరాలు అదే గదిలో గాలి పీలుస్తున్నాడు. కాని నిజానికి ఆ కాలం అతని ఘోరమైన నేరానికి విధించిన శిక్షలో కొద్దిభాగమే!

"ఈ శిక్ష తన నేరానికి తగినదేనా?" గొణిగాడు. తన వేళ్ళగుండా యింకా ఆ వెచ్చని నెత్తురు కారుతున్నట్లు అనుభూతి కలిగింది. విచారణ జరిగిన రోజులు ... ఎంత మంది నల్ల కోట్లతో ... భీతిని ప్రతిబింబించే కళ్లు వందలకొద్ది తనవైపు, .... చేతులు ఒక విధమైన తృప్తితో నలుపుకున్నాడు.

నిరాశ మళ్లీ కదిలింది. పగ మనసంతా నిండింది. తప్పించుకోవాలి ... తన భవిష్యత్తును నాశనం చేసినవాళ్ళను తనునాశనం చేయాలి. జ్వరంతో వణికినట్లు వణికింది అతని శరీరం. పచార్ల వేగం హెచ్చింది ... నుదుటినుంచి చెమట ...

మళ్లీ పెద్ద మెరుపు ... ఎన్నడూ లేనంత కాంతి తన చీకటి గదిలో. అతనిదృష్టి హఠాత్తుగా మూల గోడకు వున్న పెద్ద రాతిమీద పడింది. తన కళ్లు తన్ను మోసం చేస్తున్నాయా? నిజంగా ఆ రాతి చుట్టూవున్న పగులునే చూస్తున్నాడా? కాలి వేళ్ళమీద నడిచాడు. తొందరగా క్రిందికిజారి ఆ రాతిచుట్టూ తడుముతున్నాడు. వేళ్ళకు రక్తం చిమ్మేలా ఉద్రేకంతో తడుముతున్నాడు, రాతి పగులు చుట్టూ ...

అరే! ఆ రాతి చుట్టూవున్న పగులు చాలా లోతైనదే. రాయికూడా వదులుగా ఉందే! ఒక్క పట్టుపట్టాడు. వేళ్ళనుండి చర్మం తొలిగి పోతున్నట్టుంది. కదిలింది. రాతిని బలంగా తొలగించి వెంటనే పక్కన పడేసి ... అది వదిలిన చిక్కని చీకటిలోకి చూశాడు ... మళ్లీ మెరుపు ... ఆశ! రాయి తీసినచోట క్రిందికి మార్గం కనిపించింది.

---

మొదటి బహుమతి రూ. 50

ఇనకొల్లు రవిప్రసాద్

పి. యు. సి., బాపట్ల ఆర్ట్సు అండ్
సైన్సెస్ కాలేజి, బాపట్ల

అక్కడే ... రాయి తీసిన జాగాలో కౌగితం మడత ... కాలంతో పాటు మాసి పోయి నట్టుంది ... వణుకుతున్న కాళ్లతో కిటికీ వైపు పోతున్నాడు. ఇంకా దగ్గరికి ... కాగితంమీదికి పల్చని వెలుగు జైలు లాంతరునుంచి దూకింది. ఏదో సందేశం ... ముదురురంగు ద్రవంతో వ్రాసి వుంది ... చదివాడు ... ఆమసక వెల్తురులో ... 'నేను తప్పించుకు పోయిన మార్గం యిదే — దీన్ని కనిపెట్టినవాడు నాయంత అదృష్టవంతుడు'.

బయట సెంట్రీ అడుగుల చప్పుడు. గంగులు పక్కన పెట్టిన రాతివేపుదూకి దానిని పూర్తిగా తన శరీరంతో కప్పివేశాడు. అడుగుల చప్పుడు దూరమైంది. వెంటనే తన తల, భుజాలతోసహా ... ఆ యిరుకు దారిలో దూరాడు ... పాము దూరినట్లు — పురుగు దొలిచినట్లు ... తొడలవెనక్కి చేతులతో ... మళ్లీ రాతిని యథాప్రకారంగా జరిపాడు.

సొరంగంపక్క గోడలు తడిగా చల్లగా తగుల్తున్నాయి. ... ములుకుల్లాంటి రాతి అంచులు బట్టలను, శరీరాన్ని చీలుస్తున్నట్లుయింది. ఇదేమీ గంగులు గమనించినట్లు లేదు. అతని కళ్లలో మెరుపు ... పారిపోతున్నాడు. తను తప్పించుకు పారిపోతున్నాడు. రక్తసిక్తాలైన వేళ్లను ఆ బురదలో వెనక్కి గుచ్చుతూ శరీరాన్ని వానపాములా ... పాములా ... పొట్ట మీదుగా నెట్టుకు పోతున్నాడు.

పోతున్నకొద్దీ దారిలోతుకి దిగుతున్నట్టుంది. క్రిందికి వంగి పోతున్నది. గోడలు ... తడి ... మట్టివాసన ... కొనదేలిన అంచులతో రాళ్లు అతని మాంసాన్ని రుచి చూస్తున్నాయి. అలాగే నెట్టుకుంటూ పోతున్నాడు. పోతున్నకొద్దీ దారి సన్నబడి పోతున్నది. ఊపిరి తీయడం కష్టమై పోతున్నది ... చీకటి చిక్కబడి పోతున్నది. ఒక్కక్షణం ఆగాడు. ... ఏదో విపరీతమైన భయం దూసుకుపోయింది అతన్ని ... తనగదిలోకి వెడితే మళ్లీ ... వెనక్కి ... పైకి తిరిగి చేరడం అసాధ్యమని గ్రహించాడు. చల్లని వణుకు ... గుండెని ఎవరో చల్లని చేతితో నొక్కివేస్తున్నట్లుయింది. పళ్లు బిగించాడు. ఇంకా ముందుకు, మానవాతీతమైన శక్తితో నిరాశమీదుగా ప్రాకి పోతున్నాడు.

దారి కనిపించింది ... కాని దీనికి చివర అంటూ లేదేమో! దారి మళ్లీ వంగినప్పుడు కనిపించిన దృశ్యంతో అతని ఊపిరి క్షణకాలం ఆగి పోయినట్లుయింది. చంద్రకాంతి ... గుండ్రంగా వెన్నెల

పడిన దృశ్యం. ఎంతో దూరం లేదు ... సొరంగం చివరికి వచ్చేశాడు ?.. విజయం ! ... విముక్తి.

చల్లనిగాలి ముఖం మీదుగా వీచింది. త్వరత్వరగా ముందుకు సాగాడు.

దారి యింకా వంకర అవుతోంది పోతున్నకొద్దీ. తన శరీరం విరుగుతోందా అన్నట్లు వంగ వలసినంత వంకర వచ్చింది, ఏవో వింతైన నల్లని సన్నని నీడలు అతని కళ్లమీదుగా ... వెలుగుమధ్యగా ... ...

ఉన్నట్లుండి జారినట్లైంది శరీరం. ఇంక కొద్దిగజాలే వెళ్లాల్సి వుంది. గంగులు తల ఏదో గట్టిపదార్థాన్ని తాకి అతనిస్పృహతప్పినట్లైంది. ఒక్క క్షణం ... కళ్ళు తెరిచాడు ... ఇనపకడ్డీలు దృఢంగా బిగించిన చట్రుంగుండా చంద్రకాంతి....పక్కన ఒక అస్థిపంజరం.



# వెంటపడిన వ్యక్తి

హాలు నుంచి ఇవతలకి వచ్చి టైము చూసుకున్నాడు చక్రవర్తి. పన్నెండున్నర అయింది. ఆ సినిమా చాలా రోజుల నుంచి ఆడుతుండడం చేత జనం అట్టే లేరు. అది నవంబరు మాసం కావడంవల్ల కొద్దిగా చలిగా ఉంది. నెమ్మదిగా బయలుదేరి జి. టి. రోడ్డుమీదికి వచ్చి, న్యూ సినిమా వద్ద కుడిచేతి వైపు తిరిగాడు. స్టేషన్‌వద్ద ఉన్న టన్నెల్ దాటి ధాధ్కా రోడ్డు మీదికి వచ్చాడు. హాస్టల్ చేరుకోడానికి ఇంకా ఒక మైలు నడవాలి. ఎక్కడా మనుష్య సంచారం లేదు.

కొంత దూరం వెళ్లిన తరువాత ఎవరో వెనకాల వస్తున్నట్టు అనుమానంవేసి వెనక్కి తిరిగి చూశాడు. ఎవ్వరూ కనిపించలేదు. కొంత దూరం వెళ్లిన తరువాత ఎందుకో మళ్లీ అనుమానం వచ్చింది. మళ్లీ తిరిగి చూశాడు. ఈ సారి కూడా ఎవ్వరూ కనిపించలేదు. తన అనుమానానికి నవ్వుకున్నాడు. ఇలా ఎవరో వెనకాల వస్తున్నట్టు మాటి మాటికీ తనకి అనుమానం రావడానికి కారణం ఆ రోడ్డు నిర్మానుష్యంగా ఉండటమే అని అనుకుని, ఇటువంటి అనుమానాలకి తావు ఇవ్వకుండా ఉండడానికని రైల్వే కాలనీలో ఉండే అమ్మాయిని గురించి ఆలోచించడం మొదలుపెట్టాడు.

కాని అతని ఆలోచనలు అట్టే సేపు సాగలేదు. ఎవరో తనని వెంటాడుతున్నారన్న అనుమానం అతన్ని పీడిస్తూనే ఉంది. ఉండబట్టలేక వెనక్కి తిరిగాడు ఈ సారి నిజంగానే ఎవరో వస్తున్నారు. ఎందుకో అతనికి కొంచెం భయం వేసింది. మొన్న తన సీనియర్ స్టూడెంట్ కేశవ్‌దాస్ చెప్పాడు — సెకండ్‌షో చూసి ఈ రోడ్డు మీద రావడం కొంచెం ప్రమాదకరమని.

అన్నిసార్లు వెనక్కి తిరిగిచూస్తే తను భయపడుతున్నట్లు వాడికి తెలిసి పోతుందని మరి వెనక్కి తిరిగి చూడకుండా కొద్దిగా వేగం హెచ్చించి నడవడం మొదలు పెట్టాడు.

ఇంతలో అతని బుర్ర కూడా చురుకుగా పని చెయ్యసాగింది.

---

రెండవ బహుమతి రూ. 25

**టి.వి. సత్యనారాయణ**

(రెండవ సంవత్సరం — మైనింగ్, అసన్‌సోల్ పాలిటెక్నిక్, అసన్‌సోల్, బర్ద్వాన్ జిల్లా, పశ్చిమ బెంగాల్)

---

ఇప్పుడు తనేం చెయ్యాలి?

మొదట అసలు వాడు తనకోసమే వస్తున్నాడో, లేక ఏదో తన దారిని తాను పోతున్నాడో తెలుసుకోవాలి. అదేదో సినిమాలో చూసినది గుర్తుకి వచ్చింది. హీరో వెనకాల ఎవరో వస్తూంటే, అతను తన వెంట బడ్డాడా లేదా అనేది తెలుసుకోడానికని ఆహీరో ఆగి సిగరెట్ వెలిగిస్తాడు. అప్పుడు అవ్యక్తి కూడా ఆగి ఎటో చూస్తున్నట్టు నటిస్తాడు. దాన్నిబట్టి అతను తన వెనకాల పడ్డట్టు హీరో గ్రహిస్తాడు. అలా చెయ్యవచ్చు కాని, తను సిగరెట్ కాల్చడు. పోనీ వంగి ఏదో వెతుకుతున్నట్లు నటిస్తే...?

అతను ఆగి, వెనకాల వస్తున్న వ్యక్తిని ఒకకంట కనిపెడుతూనే ఏదో వెతుకుతున్నట్టు నటించసాగాడు. ఆ వ్యక్తి అతన్ని సమీపించి, అతన్నిదాటి ముందుకి వెళ్ళిపోయాడు. అలా తననిదాటి వెడుతున్నప్పుడు ఆ వ్యక్తి టైరుచెప్పులు తొడుక్కొని ఉన్నట్టు గమనించాడు చక్రవర్తి. తనని దాటి వెళ్ళిన ఆ వ్యక్తి కొద్దిగా ముందుకి వెళ్ళి, ఎడమ పక్కనున్న గేటు తెరుచుకొని లోపలికి వెళ్ళిపోయాడు.

అది చూడగానే అంతవరకు భయపడుతున్న చక్రవర్తికి ఎక్కడలేని నవ్వు వచ్చింది. ఇంతవరకు తను ఏమేమిటో అనుకున్నాడు కాని ఆ వ్యక్తికూడా తనలాగే ఏదో సినిమాచూసి వస్తున్నట్టున్నాడు. అనవసరంగా ఎంత భయపడ్డాడు తను?

హుషారుగా అడుగులు వెయ్యడం మొదలుపెట్టాడు చక్రవర్తి. ఇంతలో అతనికి ఒక ఆలోచన వచ్చింది. హాస్టల్‌కి వెళ్ళిన తరువాత, అందరితో ఎవరో తనని అటకాయించారని, వాడికి నాలుగు తగల్నిచ్చి వచ్చానని చెప్తే?

కాని చెప్పేముందు బాగా ప్లాన్‌వేసి చెప్పాలి. తను సెన్ రాలె మోడ్ దాటి వస్తుంటే పోస్టాఫీసు దగ్గర ఇందాకటినుండీ వెంటబడ్డతను గబగబా తనవద్దకి వచ్చి కత్తి చూపించాడు. ఆ పళంగా తను తన గుప్పెట్లోఉన్న మట్టిని అతని కళ్ళల్లోకి – బైదివే – గుప్పెట్లోకి మట్టి ఎలా వచ్చింది? అతని వాలకం చూసి అనుమానంవేసి తను మొదటే కొంతమట్టి చేతిలోకి తీసుకుని రెడీగా ఉన్నట్టు చెబితే సరి. కాని నమ్మశక్యంగాలేదు. అసలు పోస్టాఫీసు దగ్గర కాకుండా "టిప్‌టాప్" దగ్గరఉన్న వంతెన దగ్గర అంటే ఇంకా బాగుంటుందేమో...

ఆలోచిస్తూ నడుస్తున్న చక్రవర్తి నోటిని ఒక బలమైన చెయ్యి మూసింది. అతను పెనుగులాడాడు. కాని, ఇంతలో ఏదో గట్టిగా తలమీద తగలడంవల్ల కళ్ళు బైర్లు కమ్మాయి. స్పృహతప్పి నేలమీద పడిపోతున్న అతనికి టైరుచెప్పులు తొడుక్కొని ఉన్న రెండు కాళ్ళు కనిపించాయి.

***

# నీకు జ్ఞాపకం ఉందా ?

నీకు జ్ఞాపకం ఉందా? రాధా! మనం స్కూల్లో చదువుకొనేటప్పుడు కెమిస్ట్రీ ఎక్స్పెరిమెంట్లు చేస్తూ మనం ఇద్దరం కలుసుకొన్న రోజు.

నీవు మా ఊరికి క్రొత్తగా వచ్చారు. మీరు గొప్పవారని తెలుసుకొన్నాను. నా చిన్నప్పుడే మా నాన్న మమ్మల్ని విడిచి వెళ్ళిపోయారు. మా అమ్మ బట్టలుకుట్టి నన్ను చదివించేది. నేను నీతో స్నేహం చేసినప్పుడు, మా అమ్మ నన్ను తిట్టేది – గొప్పింటివాళ్ళతో స్నేహం చేయకూడదని. కాని నేను మా అమ్మ చెప్పినమాట వినలేదు.

ఆ రోజు నీవు నన్ను నీ పుట్టిన రోజుకి మీ ఇంటికి పిలిచావు. మా అమ్మ వెళ్ళవద్దని చెప్పింది. కాని నేను మా అమ్మకి తెలియకుండా మీ ఇంటికి వచ్చేశాను. నేను వచ్చేసరికి మీ ఇంటినిండా చాలామంది బంధువులు ఉన్నారు.

వాళ్ళందరు నీకు ఏవో కానుకలు ఇస్తున్నారు. నన్ను నీవు దూరంనించి చూడగానే పరిగెత్తు కొచ్చావు. "నేనేమీ, తీసుకొని రాలేదు, రాధా! నీకు ప్రెజంటు ఇద్దామంటే నా దగ్గర ఏమీలేదు."

"నీవే వచ్చావుగా, అదే నాకు ప్రెజంటు" అన్నావు.

ఆ తర్వాత మనకు పరీక్షలు దగ్గరకు వచ్చాయి, వెళ్ళిపోయాయి కూడా! మా అమ్మ నన్ను కాలేజీకి పంపించలేక ఉద్యోగం చేయమంది. ఏదో మన ఊళ్ళోఉన్న ఒక చిన్న కంపెనీలో ఉద్యోగం దొరికింది. ఆ విషయం చెబుదామని మీ ఇంటి కొస్తే, మీ అమ్మ నిన్ను చూడనివ్వలేదు. "నీవు ఇంక రాధని కలుసుకోకూడదబ్బాయ్!" అన్నది. నాకు ఏడుపు వచ్చినంత పనయింది.

ఆ తర్వాత నువ్వు పై చదువులకి మీ మామయ్యగారి వూరు వెళ్ళిపోయావు. వెళ్ళిపోతున్నప్పుడు అంతవరకు మన గుండెలలో పదిలంగా దాచుకున్న ప్రేమ పెల్లుబికి వచ్చింది. విడలేక విడలేక విడిపోయాము.

---

రెండవ బహుమతి రూ. 25


వి. బి. రామారావు

బి. టెక్ (ఫైనల్)
[కెమికల్ ఇంజినీరింగు]
ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్
టెక్నాలజీ, బొంబాయి–76

కొన్నాళ్ళపాటు ఉత్తరాలు వ్రాసుకునేవాళ్ళం. నెమ్మదిగా అవి కూడా తగ్గిపోవడం మొదలు పెట్టాయి. వస్తావని ఎదురు చూసే వాడిని. ఒకసారి, ఎడ్యుకేషనల్ టూర్‌కి వెళ్ళాలని, మరొకసారి ఏదో పెళ్ళికి వెళ్ళాలని సెలవలకు రాకుండా అక్కడే గడిపేశావు.

అలా రోజులు, వారాలు, నెలలు గడిచి పోయాయి. మన ఊరు పెద్దదయింది. నాకు ఇంకొక పట్టణంలో అదే కంపెనీలో పెద్ద ఉద్యోగం వచ్చింది. మా అమ్మ బట్టలు కుట్టడం మానేసి నా దగ్గరకు వచ్చేసింది....

ఆ తరువాత......మనం ఎల్లాగో కలుసుకొన్నాము. నా రాధ నాదయింది. మనం ఈ రోజున మన ఇరవై ఆరవ వివాహ వార్షికోత్సవం జరుపుకోబోతున్నాము. ఈ సమయంలో నీవు మన అమ్మాయి రేఖని గురించి విచారించడం బాగాలేదు. రేఖ ఎవరినో ప్రేమించిందని అనుమానిస్తున్నావు గదూ. అది నిజమే. మొన్న వాళ్ళిద్దరిని పార్కులో చూశాను. అమ్మాయి ద్వారా ఆ అబ్బాయిని పిలిపించి అన్ని విషయాలు కనుక్కుందాము.

నీకు జ్ఞాపకం ఉందా? రాధా! ఒక రోజున, నీ పుట్టినరోజుకు ఒక బీద అబ్బాయిని ఆహ్వానించావు!

***



# సాదా ప్రేమగీతం

ఇప్పుడీ వసంతం వచ్చి కిటికీరెక్కల్ని తోసింది
ఎంతచెప్పినా వినిపించుకోకుండా ఓ కోయిల కూసింది
తలుపులోని దూరపు కొండల మలుపులోంచి
సెలయేరొకటి హడావుడిగా పరుగు తీసింది.

ప్రియతమా, ఇక ప్రశ్నలతో కాలక్షేపం వద్దు
ప్రిదిలిపోయే క్షణాలన్నీ తీవ్రవాంఛా సుగంధంలో అద్దు.

జన్మాంతర వాసనా తటిల్లతల నడ్డగించే నీ శిరోజాల నీరదాల
సందోహాలు పక్కకొత్తిపట్టి సందేహాలు కాస్తా కట్టిపెట్టి
నా తలమీది జ్ఞాపకాల మూటుచూడు, నిన్నటి పాటుపాడు—
నీ సౌందర్య కిరణ ప్రసారంలో వెల్లబారినవాణ్ణి
నీ చూపుల రంపాలచే కోయబడ్డవాణ్ణి.

జీవితం పన్నిన వ్యూహంలోంచి తప్పించుకున్నాం—మనదే భవిష్యత్తు
ఈ వసంతం యుగాంతం దాకా వుండేట్టు చేశానులే బందోబస్తు
నిశ్శబ్దంలో ప్రేలిన ముద్దులో ప్రపంచపు యథార్థాలన్నీ మండిపోయి
స్నిగ్ధ స్వప్నాలు పూస్తున్నాయి, ఒడినిండా దూసుకో.

నక్షత్రాల సందుల్లోంచి నగ్నంగా నవ్వే ఆకాశంకింద
నన్ను కవ్వించే నీలోని దివ్య రహస్యాలను విప్పనీ
భుజంమీదపడే జూకామల్లె తీగతో నిన్ను కట్టివేసి
నిజంగా మన కలయిక అద్వితీయమని చెప్పనీ.

— పణతుల రామచంద్రయ్య

# బేరగాడు

## హిమశ్రీ

స్టెనో టైపిస్టు నీరజకి తప్ప, ఆ ఆఫీసులోని ఉద్యోగులందరికీ, ఆఫీసు గడియారం పొద్దున్న కొట్టే పదిగంటలూ విషాదగీతంలా, సాయంత్రం కొట్టే ఐదు గంటలూ హుషారైన డ్యూయెట్‌లా వినిపించటం రివాజు. నీరజకిమాత్రం తన పనేమో, తన లోకమేమో. గడియారంవంక చూచి ఎరుగదు. కాని ఆ సాయంకాలం ఆమెకే గడియారం గంటలు డ్యూయెట్ గానంలా వినిపించాయి. వెంటనే టైప్‌రైటర్ కప్పేసి, వ్యానిటీ బ్యాగ్ తీసుకుని ఆఫీసుభవనం బయటికి వచ్చేసింది. ఆమె మనసంతా ఉత్సాహంతో నిండిపోయింది. ఆ రోజు రెండునెలల బోనస్ ఇచ్చారు.

నీరజ మనసుని ఏవో ఆలోచనలు అగరువత్తుల దట్టమైన ధూపంలా ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. నెమ్మదిగా అడుగులువేస్తున్న నీరజకి దగ్గరగావచ్చి ఓ రిక్షావాలా ఆశగా గంట మోగించాడు. ఆమె తలెత్తి చూసింది. రిక్షావాలా ఆశగా చూశాడు. ఆమె అడ్డంగా తల ఆడించింది. రిక్షావాలా నిరాశతో వెళ్లిపోయాడు. అది గమనించిన నీరజకి క్షణం మనసు చివుక్కుమంది. అతన్ని పిలిచి రిక్షాఎక్కి వెళ్దామనుకుంది. కాని తను ఆ రోజు తీరిగ్గా నడవాలి. బజారుమీదుగా పోతూ రోడ్డుకి రెండు వైపులా ఆకర్షణలతో ఆహ్వానించే దుకాణాల్ని చూస్తూ నడవాలి. నాలుగు వందల రూపాయలు బోనస్ వచ్చింది. కావలసిన మంచి మంచి వస్తువుల్ని కొనుక్కొని ఇంటికి ఆనందంతో వెళ్ళాలి. అన్నట్టు కొనాల్సిన వేమిటి? అమ్మకి మంచి చీర, గోపీకి శ్లాక్‌కి సరిపడే టెరిలిన్ క్లాత్, తనవాచీకి బ్యాంగిల్ స్ట్రాప్. హైహీల్డ్ షూజ్, నైలెక్స్ —

సంజ ఆలోచనలకి అకస్మాత్తుగా అంతరాయం కలిగింది. హారన్ మ్రోగిస్తూ, ఆమెకి చేరువగా కారు ఆపి డ్రైవర్ సీటులో కూర్చున్న వ్యక్తి, కిటికీలోంచి తల బయటికి పెట్టి "హల్లో మిస్ నీరజా" అన్నాడు. నీరజ ఉలిక్కిపడి తలెత్తి చూసింది. వెంటనే పెదవుల మీదికి చిరునవ్వు తెచ్చుకుంది. ప్రకాశం మందహాసం చేశాడు.

"నమస్తే"

"ఇంటికేనా? డ్రాప్ చేస్తాను, రండి."

అతను డోర్ తెరవబోయాడు.

"థ్యాంక్స్. కొంచెం షాపింగ్ ఉందండి. క్షమించండి."

నీరజ ముందుకి సాగబోయింది.

"పరవాలేదు. కొంచెమేగా! వెయిట్ చేస్తాను." అతను కొంచెం నవ్వి, ప్రాధేయపూర్వకంగా అన్నట్టు అన్నాడు. నీరజకి విసుగు పుట్టింది. గట్టిగా విదిలించుకోటానికి వీల్లేదు.

అతను ఆఫీస్ సెక్రెటరీకి దగ్గిరి చుట్టం. మంచి బిజినెస్ చేస్తున్న ఇంజనీరింగ్ కంట్రాక్టరు. బి. ఇ. చదివిన విద్యాధికుడు. తరుచు ఆఫీసుకివచ్చి సరదాగా అందర్నీ పలకరించి తన హాస్యధోరణితో అందర్నీ నవ్వించి కాలక్షేపం చేసిపోతుంటాడు. అతనంటే తనకే ఎందుకో చిరాకు. ఏమాట మాట్లాడినా తనెలా ప్రభావితురాలైందీ అతను కనిపెడుతూ, తన అనుగ్రహంకోసం పడిగాపులు కాస్తున్నట్టు కనిపిస్తాడు. నిజానికి అతని అంతస్తుకి తన అంతస్తుకి హస్తిమశకాంతరం. అతనలా ఎందుకు ప్రవర్తిస్తాడో దురూహ్యం. ఎంచేతంటే, మర్యాద సరిహద్దు దాటి అతనెప్పుడూ పోలేదు.

"ఏమిటి, ఆలోచిస్తున్నారు. ఈ రోడ్ సైడ్ న పార్క్ చేస్తాను. త్వరగా వచ్చేస్తారా?"

నీరజకి ఏమనాలో తోచలేదు. అతన్నించి తప్పించుకోటానికి మార్గాలు ఆలోచించ సాగింది.

"ఏమిటండీ ఆలోచన? కారు అరిగిపోతుందనా. మీరు అలిసిపోతారనా?" అతను నవ్వుతూ అన్నాడు.

"అలా ఎగ్జిబిషన్ దాకా వెడతానండీ." చటుక్కున మెరుపులా ఆలోచన రాగా, నీరజ సాకు చెప్పింది.

"ఇంకేం నేనూ అక్కడికే బయలుదేరాను. ఆ షాపింగ్ అక్కడే కానియ్యవచ్చు. లోపలికి రండి" అంటూ అతను ఆమె సమాధానం కోసం ఎదురుచూడకుండా బ్యాక్ డోర్ తెరిచాడు. ఇక చేసేది లేక నీరజ అయిష్టంగానే కారెక్కి సీటుకి చేరగిలబడ్డది. ఏవేవో కొనుక్కొని ఇల్లుచేరాలని సముద్రపుటలలా ఉత్సాహంగా తను వెడుతుంటే ఈ ప్రకాశం అనే వ్యక్తి ఒడ్డులా అడ్డుపడి తన సంతోషాన్ని పాడుచేశాడని ఆమెకి కసిగా ఉంది. అతని ఉద్దేశమేమిటో, ఇలా తన దారికి అడ్డు రావటమెందుకో



ఆమెకి బోధపడలేదు. ఎవరైనా చూస్తే బాగుండదని ఆమెకి తటాలున అనిపించింది. తను ఎవరితోను అంత చనువుగా ఉండదు. ప్రకాశం లిఫ్టు ఇచ్చాడంటే ఎవరేమనుకుంటారో! ఇక ఎప్పుడూ నడిచి పోకూడదని నీరజ తీర్మానించుకుంది. అయినా ఈ ప్రకాశం ఇలా తటస్థపడతాడని ఎవరనుకున్నారు?

నీరజ ఆలోచనలతో విసిగించుకుంటుండగానే ఎగ్జిబిషన్ గ్రౌండు వచ్చింది. ప్రకాశమే రెండు.

టిక్కెట్లు తెచ్చాడు. అతని పక్కన నడుస్తుంటే నీరజ ముఖం ఎర్ర బారింది. లేనిపోనిది తనే కొని తెచ్చుకుంది. ఇంటిదగ్గర డ్రాప్ చెయ్యమన్నా సరిపోయేది. తన అజ్ఞానానికి నీరజ చింతించింది. కాని ప్రకాశం లేశమాత్రమైనా సంకోచించకుండా ఆమెతో ఏదో నవ్వుతూ మాట్లాడుతూనే ఉన్నాడు. అది అమాయకత్వమో, గడుసుతనమో నీరజకి అర్థం కాలేదు.

ఇద్దరూ రకరకాల దుకాణాలనీ చూస్తున్నారు. ఎవరైనా స్నేహితురాలు కనిపిస్తే ప్రకాశం బారినించి తప్పించుకోవచ్చని నీరజ ఆత్రుతగా అందరి ముఖాలవైపూ చూస్తోంది. ఎవరూ కనిపించక పోయేసరికి ఆమెకి చిరాకు ఎక్కువైంది.

"అదేమిటండీ, షాపింగన్నారు, ఏదీ కొనరేం?" అన్నాడు ప్రకాశం వింతగా.

"తర్వాత మళ్ళీవస్తాను. ఇంక వెడతానండి." ఆమె ముఖం చిట్లించుకుని సమాధానం చెప్పింది.

"చిత్రప్రదర్శనశాల చూడరూ?" అన్నాడు ప్రకాశం.

చీకట్లో అకస్మాత్తుగా విద్యుద్దీపం వెలిగించి నట్టయింది. తనెలా మర్చిపోయింది! చిత్రప్రదర్శనశాల! అందులో విశ్వం చిత్రాలుకూడా ఉన్నాయి. ఆమాట ఎంతో గర్వంగా చెప్పాడు విశ్వం. అప్పటినించీ ఎగ్జిబిషన్‌కివచ్చి ఆ చిత్రాలు తను చూడాలని అనుకుంటూనే ఉంది. వాటిని తను చూడలేదనికాదు. మొదలు పెట్టినప్పటినించీ పూర్తి చేసేదాకా వాటిని తను కొన్ని వందలసార్లు చూసింది. కాని చిత్ర ప్రదర్శనశాలలో చూడటం వేరు.

"పదండి."

ఆనందాతిరేకంతో నీరజ చిత్ర ప్రదర్శనశాల వైపు నడిచింది. ప్రకాశం ఆమెని వెంబడించాడు. కాని ఆమె అతని ఉనికిని మర్చిపోయింది. ప్రదర్శనశాలలో ఎన్నో చక్కటి చిత్రాలున్నాయి – నీటిరంగుల చిత్రాలూ, తైలవర్ణ చిత్రాలూ. కాని నీరజ వాటిని సరిగాచూడనైనా లేదు. ఆమె కళ్ళముందు తాండవించేవి విశ్వం చిత్రాలు.

విశ్వం చిత్రాలు! రెండే రెండైనా అవి ప్రదర్శనశాలయావత్తూ విస్తరించి ఉన్నట్టు అనుభూతి పొందింది నీరజ. వాటి వైపు అలాగే తన్మయత్వంతో చూడసాగింది. ఆమెకళ్ళు ఆనందంతో మెరిసిపోతున్నాయి. ఆయిల్ కలర్స్‌లో ఎంత చక్కగా చిత్రించాడు విశ్వం! ఎంతభావస్ఫోరకంగా ఉన్నాయి.తనచిత్రాలుఎవరూ సరిగా అర్థం చేసుకోవటం లేదని నిరాశతో అలమటించి పోతున్నాడు విశ్వం. అతని కళలోని గొప్పతనాన్ని విమర్శకులు ఎందుకు కనిపెట్టలేకపోతున్నారువ్చ్. ఈ రోజుల్లో కళ ఎవరిక్కావాలి! ఆశ్రయం! అంతే! అది ఉంటే ఎవరైనా గొప్పవాడై పోతాడు.

అదిలేక విశ్వం అడుగునే మగ్గిపోతు న్నాడు. అతని ఆత్మవిశ్వాసం సన్న గిలిపోతోంది. తనలో నిజంగా కళ లేదేమోనని శంక అతన్ని పాతాళా నికి కుంగదీస్తోంది. ఆ విషయం తనకి స్పష్టంగా తెలుసు.

నీరజకి కళ్లలో నీళ్లు తిరిగాయి. మరోవిషయం ఆమెకి తట్టింది. విశ్వం చిత్రాలు ప్రముఖ స్థానంలో లేవు. కొన్ని చిత్రాలు అందరికీ వెంటనే కనిపించేవిధంగా ప్రముఖంగా ప్రేలాడగట్టారు. వాటిని చూస్తుంటే నీరజకి కోపం వచ్చింది. నిజానికి అవి విశ్వం చిత్రాల కంటె ఏవిధంగా బాగున్నాయి? పరీక్షగా చూడసాగిందామె. అలా చూస్తుండగా కొట్టొచ్చినట్టు "అమ్మబడినవి" అనే బోర్డులు చాలా చిత్రాలకి ప్రేలాడదీసినట్లు ఆమె చూపుల్ని అరికట్టాయి. విశ్వంచిత్రాలు "అమ్మ కానికి" అని జాలిగా చూస్తున్నాయి. ఆమెలో ఏదో ఆవేశం కలిగింది. ఆ ఆవేశంలో ఒక భావం మిరుమిట్లు కొల్పేవిధంగా ప్రకాశించింది. విశ్వం చిత్రం ఒకదాని ఖరీదు మూడు వందలు. ఆమె వెంటనే ప్రదర్శనశాల ఉద్యోగి దగ్గరికి వెళ్ళింది.

"విశ్వంగారి చిత్రం నేను కొంటాను. ఇవిగో మూడువందలు" హ్యాండ్ బ్యాగ్ తీసి మూడువందల రూపాయలనోట్లు ఇచ్చింది నీరజ. ఆ ఉద్యోగి ఆమెవైపోసారిచూసి, రసీదుపుస్తకం తీశాడు. "పేరేమిటండీ?"

"నీ—" మాటమధ్యలోనే ఆపిందీ నీరజ. ఊఁహు— తన పేరు బయటికి రాకూడదు. అందులో స్వారస్యం లేదు, రావలసిన ఫలితమూ రాదు.

"నీహారిక—మిస్ ఎస్. నీహారిక.

"అడ్రసు?"

ఏదో అడ్రసు చెప్పింది నీరజ. ఆమెవదనం జ్యోతి వెలిగించిన ప్రమిద అయింది.

"ఎగ్జిబిషన్ అయింతర్వాత చిత్రం మీకు పంపిస్తామండీ."

థాంక్స్ అన్నాడు ఉద్యోగిరసీదు ఇస్తూ.

"నేనే వస్తాలెండి." అంది నీరజ. రసీదు పుచ్చుకొని హాండ్ బ్యాగ్ లో పెడుతూ.

ఇదంతా ప్రకాశం చిత్రంగా చూస్తున్నాడు.

"మిస్ నీహారికా! ఆ చిత్రంఖరీదు మూడు వందలా?"

ప్రకాశం స్వరంవిని, అతని ఉనికి మర్చిపోయిన నీరజ కొంచెం ఉలిక్కిపడి, సర్దుకుంది - నీహారిక!.

"అది చాలా తక్కువ."

ఆమె వదనంలోకి నిదానించి చూశాడు ప్రకాశం.

"అవును. అదే నేననేది. అది కొనాలని నేను మొదటినుంచి చాలా మనసుపడుతున్నాను. ఐదు వందలిస్తాను. నాకది అమ్మకూడదూ?"

నీరజ అతను ఎగతాళి చేస్తున్నాడేమో ననుకుంది.

"ఒప్పుకున్నట్లైనా? ఇవిగో

ఐదు వందల్ను" ప్రకాశం పర్సులోని నోట్లు పగం బయటికి తీశాడు.

నీరజ చకితురాలైంది. అది నిజంగా కళాభిమానమా ? అలా అయితే ఆ చిత్రం కొనటానికి అంత కాలం అతనెందుకు ఆగవలసి వచ్చింది ! ఆమెలో అనుమానం మొలకెత్తింది. నిస్సందేహంగా ప్రకాశం తనఅభిమానాన్ని చూరగొనటానికి ప్రయత్నిస్తున్నాడు. తన అంతస్తు అతనికి తెలుసు. తను సామాన్యురాలైన ఒక స్టెనో టైపిస్ట్. మూడువందలు పెట్టి ఒక చిత్రం కొనగలతాహతు తనకిలేదు. అలా కొనటానికి కారణం అతను ఊహించి ఉంటాడు. తను మారుపేరు చెప్పిన విషయమూ అతనికి తెలుసు. ఆ పేరుతో తనని సంబోధించాడు. ఒకవేళ విశ్వం అతనికి స్నేహితుడా ? తను విశ్వాన్ని ప్రేమిస్తున్నట్టూ తెలుసా ? విశ్వానికి అతను సహాయం చేయదలచుకున్నాడా ? అందుకే తన మీద కూడా అభిమానం చూపిస్తున్నాడా ? ప్రశ్నా పరంపర నీరజని వేధించ సాగింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు ?"

నీరజ అతనివైపుదీక్షగాచూసింది. అతని కళ్ళలో నిజాయితీ కనిపించ లేదు.

"క్షమించండి."

నీరజ ప్రదర్శనశాల బయటికి వచ్చింది. ప్రకాశం ఆమెని అనుసరించాడు.

"మీకు విశ్వంగారు తెలుసా ?"

"ఉఁహుఁ" ప్రకాశంపెదవి విరిచాడు. "ఆయనగొప్పచిత్రకారుడా?"

నీరజ అతనివైపు కనుబొమ్మలెత్తి చూసింది.

"ఆ మాట అడగవలసింది నేనేమో ?" అందామె.

ప్రకాశం నవ్వాడు.

"అయిదువంద లిస్తానన్నారు. మంచి చిత్రం కాకపోతే ఎందుకివ్వాలనుకున్నారు? మంచిచిత్రం వేసిన వ్యక్తి గొప్ప చిత్రకారుడుకాడా ?" నీరజ ప్రశ్నించింది. కుతూహలం కంటె కోపం ఆ ప్రశ్నలో ప్రస్ఫుటమైంది.

"నాకు చిత్రకళగురించి ఏమీ తెలియదండీ. చిత్రాల బాగోగులూ తెలియవు. నేను ఆ చిత్రాన్ని కొనాలనుకోవటం–" అతను ఆగాడు.

"ఊఁ కొనాలనుకోవటం?" ఆమె రెట్టించింది.

"మీకు కానుకగా ఇవ్వాలనే."

నీరజముఖం ఎర్రబారటం ఆ పంజ చీకటిలోకూడా అతను గమనించాడు.

"అలాంటి ప్రసంగం ఎప్పుడూ చెయ్యకండి."

కొరడాతో కొట్టినట్టు అలాఅని నీరజ గబగబా నడిచి ఎగ్జిబిషన్ ఆవరణ దాటి వచ్చింది.

"రిక్షా"

"క్షమించండి" – డ్రాప్ చెయ్యనివ్వరా ?"

"థ్యాంక్స్"

ఆమె రిక్షా ఎక్కింది. ప్రకాశం

తల గోక్కొని కారు సమీపించి డ్రైవింగ్ సీట్‌లో చేరగిల బడ్డాడు, ఎంతసేపటికీ కారు రిక్షాదాటి పో లేదు. నీరజ కుతూహలంతో వెనకవెనక్కి చూసింది. కారుఇంకా అక్కడే ఉంది.

ఈ పానకంలో పుడకని మర్చిపోవాలని ప్రయత్నిస్తూ నీరజ ఇల్లు చేరింది. త్వరత్వరగా స్నానం చేసింది. తెల్లచీర కట్టుకుంది. – ఏదో తృప్తి ఆమె మనసుని ఆవరించింది. ఎనిమిదింటికల్లా విశ్వం వస్తాడు. రోజూ సాయంత్రం ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌కి వెళ్లి, ప్రదర్శనశాలలో తన చిత్రాల్ని ఎవరైనా కొన్నారేమో కనుక్కోటం, నిష్ప్రభతో తిరిగిరావటం, ఆత్మవిశ్వాసం కోల్పోతున్నట్లు విశ్వం మాట్లాడటం మామూలే. ఈ రోజు –

నీరజ సంతోషానికి పట్టపగ్గాల్లేవు. అతనిలో చైతన్యం కలుగుతుంది. ఆత్మవిశ్వాసం కొడిదులిపిన దీపంలా వెలుగుతుంది. ఎంతో మంచి బొమ్మలు వేస్తాడు. గొప్పకీర్తి సంపాదిస్తాడు. అప్పుడు – ఒక చల్లని ఉదయాన – ఉహు – సాయం సమయాన తను చెప్పేస్తుంది. – ఆ కొడి దులిపినదెవరో! అప్పుడు చూడాలి. ఆ కళ్లలో తళుకు! ఆ వదనంలో దీప్తి!

తలుపు చప్పుడైంది.

హృదయం వేగంగా కొట్టుకుంది.

తలుపు తీసింది. ఓరగా, వయ్యారంగా నిలబడ్డది.

అతని కళ్ళలోని ప్రకాశం తళుక్కునాలి.

విశ్వం తలుపు తోసుకొని, ఓసారి నీరజవైపు యధాలాపంగా చూసి పేముకుర్చీలో కూలబడ్డాడు. ఏమిటలా నిరుత్సాహంగా ఉన్నాడు! ఒకవేళ ఎగ్జిబిషన్ గ్రౌండ్సుకి వెళ్లలేదా? నీరజ మనసులో సందేహం కలిగింది.

"ఏమిటి బావా, విశేషాలు?" అంది ఆశగా.

"దరిద్రుడి తలకడిగితే వడగండ్ల వానట." విశ్వం నిట్టూర్చాడు.

నీరజ గుండెలో ఏదో భయం గూడుకట్టుకొంది.

"ఏం జరిగింది"

"ఆ మధ్య నేను రెండు ఆయిల్ పెయింటింగ్స్ వేశాను. ఒక చిత్రం పేరు 'ఉదయం'. రెండోదాని పేరు 'అస్తమయం'. నీకు తెలుసు కదూ? వాటిని ఎగ్జిబిషన్‌లో ప్రదర్శిస్తున్నారని కూడా చెప్పాను. వాటిలో 'అస్తమయం' అనే చిత్రాన్ని ఎవరో మూడొందలిచ్చి కొన్నారట."

"మూడొందలే! ఆ బొమ్మ అంత చేస్తుందా?" ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసింది నీరజ.

"మరేమిటనుకున్నావు?" అని ఆత్మవిశ్వాసం ఉట్టిపడేట్టు అంటూ గర్వంగా తన కళ్లలోకి చూస్తాడని

ఆశపడుతూ నీరజ విశ్వం వైపు క్రీగంట చూసింది. విశ్వం అలా అనలేదు.

"రెండు చిత్రాలకీ ప్రకాశం అనే ఒకాయన వెయ్యి రూపాయలిస్తానన్నాడు. అయితే సెట్టుగా గాని తీసుకోడట. ఏం లాభం? మంచి అవకాశం పోయింది." విచారంగా అన్నాడతను.

నీరజ వదనం గట్టున వేసిన తామర పువ్వులా వాడిపోయింది.

"అయన్ని ఎరుగున్నావు కాబోలు." అందామె.

"ఓ గంట క్రితమే చిత్ర ప్రదర్శనశాలలోనే పరిచయమైంది. బాగా డబ్బున్నవాడుగా కనిపిస్తున్నాడు."

నీరజకి చిరాకేసింది.

"నీకు కావలసింది డబ్బు, ఆర్టా?" అంది విసుగ్గా.

"నీకు తెలియదు నీరజా. వెయ్యి రూపాయలంటే సామాన్యమా? నా చిత్రం కొన్నది ఎవరో నీహారికట. గాంధీనగరంట. ఫలానా వీధి అని తెలియదు. ఎలా కనుక్కోడం?"

"ఎందుకు?"

"ఓ వంద ఎక్కువిస్తే మళ్ళా ఆ చిత్రం మనకి అమ్మేస్తుందేమో."

అతనివంక నీరజ నిశ్చలంగా చూసింది. మొదటి సారిగా అతనంటే ఆమెలోఏదో విరక్తి కలిగింది. డ్రాయరు లాగి హ్యాండ్‌బ్యాగ్‌ను చేతిలోకి తీసుకుంది. రసీదు తీసింది. అది ఆమె చేతిలో నలిగిపోసాగింది. చేరెడేసి కళ్ళలో ఎర్రజీర వచ్చింది.

విశ్వంలో ఆత్మ విశ్వాసాన్ని పునరుద్ధరించాలని తను ప్రయత్నించింది. అతనిలో దురాశని రెచ్చగొట్టటానికి ప్రకాశం పూనుకున్నాడు. ప్రకాశం నేర్పుగా వలపన్నగల సమర్థుడు. ఆ విషయంలో సందేహించాలిసిందేమీ లేదు. తను డబ్బుతో కొనలేనిదేదీ లేదని నిరూపించటమే అతని ఆశయం కాబోలు.

కాని విశ్వంవ్యక్తిత్వం ఇంతేనా? ఆమెలో ఏదో నిస్పృహ కలిగింది. చేతిలోని రసీదుని అతనివైపు గిరవాటేసి "నీహారికవల్ల నీకేం ప్రమాదం రాదు. ఆమె హృద్రోగంతో హఠాత్తుగా చచ్చిపోయింది. ఆమె కొన్న బొమ్మని ఇష్టంవచ్చినవాళ్ళకి ఇష్టం వచ్చినంత ధరకి మళ్ళీ అమ్ముకోవచ్చు' అనాలని మనసులో రిహార్సలు వేసుకుంది. కృతనిశ్చయంతో అతనివైపు తీక్షణంగా చూసింది. ఉహుఁ—అలాకాదు. ఆ మాటలకి అతను చలించినా గాయపడకపోవచ్చు. "అలా కుంగిపోతావేం? నీహారిక ఎవరోకాదు నేనే" అని వెల్లడించేస్తే! తల్లడిల్లి తెల్లబోయి ముఖం చూడలేక — ఉహుఁ— నీరజ అశాంతితో వేగిపోసాగింది.

"నీరజా, ఆమె ఎవరో నువ్వు కనుక్కోగలవూ?" దీనంగా అన్నాడు విశ్వం.

ఆమె పకాలున నవ్వింది.

"నీకు నవ్వులాటగా ఉంది కదూ ?"

"కాదు. ఆమాట మొదటే అడక్కూడదూ ?"

"ఏం, నీకామె తెలుసా ?" ఆశగా ఆమెదగ్గిరికి వస్తూ అడిగాడతను.

"తెలును. ఆమె మా ఆఫీసులోనే స్టెనో టైపిస్టు. నాకు బెస్టు ఫ్రెండ్" తడుముకోకుండా చెప్పింది నీరజ.

"నిజం ?"

"ముమ్మాటికీ."

"అయితే ఈ సహాయం చేసి పెడతావుకదూ?"

"తప్పకుండా.మా ఇద్దరిదీ ఒక్క టే మాట."

విశ్వం ముఖంలోకి కళవచ్చింది.

"అబ్బ.ఎంతఏడిపించావు నీరజా! ముందే ఆ మాట చెబితే నోటి ముత్యాలు రాలి పోతాయా ?" హుషారుగా ఆమాటలని ఈలవేస్తూ విశ్వం లోపలికి పోబోయి మళ్ళీ ఆగి "అన్నట్టు మీ ఫ్రెండ్ నీహారికే ఈమె అని ఎలా చెప్పగలం ?" అన్నాడు సందేహంగా.

"ఇద్దరూ ఒకరే." అంది నీరజ దృఢంగా.

"ఎలా తెలుసు ?"

అకస్మాత్తుగా ఏదో బలహీనత ఆవరించినట్టుయి నీరజ తటాలున చెయ్యిచాపి "ఇదిగో, గుప్పిట్లో ఉంది రహస్యం, చూసుకో" అంది.

విశ్వం తెల్లబోయాడు. ఆమె తనని ఏదో ఆటపట్టిస్తోందని అతను చిన్నబుచ్చుకున్నాడు. నిరాశకూడా అతని వదనాన్ని ఆవరించింది. మేఘావృతమైన శశిబింబంలా అతను కళతగ్గి దీనంగా కనిపించే సరికి నీరజ హృదయంలో దేవినట్టయింది. చప్పున చెయ్యి వెనక్కి లాక్కుంది.

"అలా తెల్లబోతావేం బావా ? ఆమె చిత్రం కొన్నప్పుడు నేనక్కడే ఉన్నాను. నీ చేత చెప్పిద్దామని తమాషా చేశాను, అంతే. నామాట నమ్ము" నిజాయితీ ఉట్టిపడేస్వరంతో అంది నీరజ. ఆమెకళ్ళు చెమ్మగిల్లాయి. ఆమె పరిస్థితిని గమనించలేని విశ్వం తృప్తిపడ్డాడు. అతని పెదవులమీద చిరునవ్వు చిందులాడింది.

"ఏమోమరి. నీబహుమానంమర్చిపోనులే నీరజా" అంటూ విశ్వం లోపలికి వెళ్ళాడు.

అతను వెళ్ళగానే నీరజ గుప్పిలి తెరచి, రసీదుని జాగ్రత్తగా మడిచి హాండ్ బ్యాగ్‌లో పెట్టింది. కళ్ళు తుడుచుకోబోయి విరమించింది. ఆ అవసరంలేదు. బేరసారాలతోనిండిన ఈ ప్రపంచంలో ఎన్నటికీ గుర్తింపబడని కొన్ని అసలు విలువల్లా, ఆమె కన్నీరు అప్పటికే ఇంకిపోయింది.

***

# అద్వైతం

దుమ్మూ ధూళీ తో నిండివుండే ఇరుకు సందుల నుంచీ, అగ్గిపెట్టెలవంటి వెలుతురులేని కొంపల నుంచీ మేము ఇవతల పడ్డాము. ప్రాణానికి ఎంతో హాయనిపించింది. అసలు మా వారు ఎప్పటినుంచో అంటున్నారు. "కాలనీలో, మనకి "క్వార్టర్సు ఇస్తారు. వెడదాము హాయిగా ఉంటుంది" అని. వారి మాటని నేనే పెడచెవినిపెట్టి తోసిరాజన్నాను. ఆ వాతావరణం నుంచి బయటపడింతరువాతగాని తెలియలేదు నాకు, మేము ఎంతటి మురికి వాతావరణంలో ఇన్నాళ్లూ ఉన్నామో?

"కాలనీ"లో ఒక వరసలో తీర్చిదిద్దినట్టు కట్టి ఉన్నాయి ఇళ్ళు, అందంగా "టైపు"లవారీగా. ప్రక్కనే ఉన్న కృష్ణానదిలోనుంచి వచ్చి వొంటికి హాయిని కలిగించే చల్లనిగాలి. ఇళ్ళచుట్టూ విశాలమయిన ఆవరణ మొక్కలు పెంచుకోవటానికి అనువుగా వున్నది. చక్కగా గాలీ, వెలుతురూ ధారాళంగా వచ్చేట్టు పథకం ప్రకారం కట్టిన ఇళ్ళు. 'ఎలక్ట్రిసిటీ', "ఫ్లష్ అవుట్" దొడ్లూ వీటితో ఆధునిక సౌకర్యాలన్నీ అమర్చి ఉన్నవి. నామటుకు నాకు ఈ వాతావరణం ఎంతో హాయిగా అనిపించింది. అన్నీ సర్దుకుని స్తిమిత పడటానికి రెండురోజులు పట్టింది. ఆ సాయంత్రం "స్టోర్సు"కి వెళ్ళివస్తున్నాను. పరధ్యానంగా వస్తున్న నన్ను పేరుపెట్టి పిలిచిన పరిచిత కంఠధ్వని విని ఆశ్చర్యపడుతూ తలతిప్పి చూశాను. సుమిత్ర కాదుగదా? ఇంతవరకూ తనను చూడనేలేదు.

నావొంక, చెయ్యెత్తి వూపుతూ రమ్మని సైగచేస్తున్నది ఎవరు?

సన్నగా నాజూకుగా ఉన్నది. "స్లీవ్‌లెస్"జాకెట్, చెవులకిరింగులు, ఫాషన్‌గా ముడిచి ముడివేసిన జుట్టు, చేతిలో 'ప్లాస్టిక్ బుట్ట'. ఆమె ప్రక్కన అవే వేషభాషలలో మరొకామె వున్నది, ఇంకా ఆడంబరంగా.

పాలడుగు వెంకటేశ్వరరావు
బి. ఎ.



"హలో! లలితా! మరిచేపోయావా?" అన్నదామె. అప్పటికిగాని గుర్తు పట్టలేనుకాదు పూర్తిగా. అవును ఆమె సుమిత్ర. నాకు బాల్యస్నేహితురాలు. "నన్ను క్షమించు సుమీ! పరధ్యానంలో గుర్తు పట్టలేకపోయాను" అన్నాను.

"దానికేమిగాని, అయితే వొచ్చేశారన్నమాట. మొన్నే వారు అన్నారు అలాగని. బాగుంది. అన్నీ

సర్దుకుని స్తిమితపడ్డావా?" అంటూ నవ్వుతూ చేతులూపింది సుమి. ఏదో జ్ఞాపకం వచ్చినట్టు "అన్నట్టు నీకు వీరిని పరిచయం చేస్తాను. వీరు రాజీరెడ్డి. ఇక్కడ లేడీస్ క్లబ్ సెక్రటరీ. చాలా ఉత్సాహంగా ఉంటారు. ఈమె నా స్నేహితురాలు లలిత. వీళ్ళ శ్రీవారూ ఇక్కడే పనిచేస్తున్నారు. ఇన్నాళ్ళూ సిటీలోవుండి మొహం మొత్తింది కాబోలు. కాలనీకి మార్చేశారు మకాము. చాలా మంచిపనిచేశారు" అంది సుమిత్ర కొంటెగా.

నేను చేతులు కలిపి నమస్కారం చేశాను. ఆమె అలవోకగా నవ్వి, సుతారంగా నా నమస్కారం స్వీకరించినట్టుగా సంజ్ఞ చేసింది. తరవాత ఆవిడ నన్ను ప్రశ్నలడగడం, నేను సమాధానం చెప్పడం జరిగింది.

ఆమె వేసిన ప్రశ్నలు ఇట్లాంటివి. "మీ వారేం చేస్తారు? మీకు ఏ సైపు ఇల్లు ఇచ్చారు? ముందు ముందన్నా పై తరగతి ఇలు దొరుకుతుందా? మీ వారి జీతమెంత? మీకు కట్నం ఎంత ఇచ్చారు? మీ అత్తవారు బాగా ఉన్నవారేనా?"

ఎంతప్రయత్నించినా, నాకుగుండె దడ ఆగలేదు. గాభరాగా సమాధానాలు ఇచ్చాను. అంతకుమించి నాతో మాట్లాడటానికి ఆవిడకి విషయాలేమీ దొరకలేదా? అనిపించింది. అక్కడ నిల్చోనబుద్ధికాలేదు. పని వున్నదనిచెప్పి ఇద్దరి దగ్గరా సెలవు తీసుకుని వచ్చేశాను.సుమిత్ర నా దగ్గర ఇంటి నంబరుఅడిగితెలుసుకుని మర్నాడు వస్తానని వాగ్దానం చేసింది.

ఆ సాయంత్రం మావారికి ఈ విషయాలన్నీ చెప్పాను. ఆయన చిన్నగానవ్వి మాట్లాడకుండా ఊరుకున్నారు.

ఆ మర్నాడు సుమిత్ర మాఇంటికి వచ్చింది.

కాసేపు కబుర్లయాక "కాఫీ" ఇచ్చాను. కాఫీ తాగుతూ, తను బాగ్‌లోనుంచి ఒక పుస్తకం బయటికి తీసింది. ఇది క్లబ్ చందా రశీదు పుస్తకం ఇక్కడ లేడీస్ క్లబ్ వుంది. అన్ని గేమ్సూ ఉన్నాయి. చక్కగా కుట్టుపని, అల్లికలు, డ్రాయింగు, అన్నీ నేర్చుకోవచ్చును. అప్పుడప్పుడు పార్టీలవీ వుంటాయి. చాలా బావుంటుందిలే. నిన్నూ మెంబరుగా చేర్పిద్దామని వచ్చాను" అని నవ్వింది సుమిత్ర.

"చందా ఇచ్చి మెంబరవక తప్పదంటే అవుతానుగాని నేను క్లబ్‌కి రావటానికి వీలవుతుందా అని భయపడుతున్నాను" అన్నాను నవ్వుతూ.

"నీ మొహం. మగవాళ్ళని ఆఫీసుకి పంపాక ఏమితోస్తుంది? రోజూ క్లబ్‌కి వచ్చేవంటే ఇటు నలుగురితోనూ పరిచయం అవుతుంది. తోచకపోవటమూ వుండదు. నేనవుంటాను. ఇంకా, ఈ సైపుల నుంచి చాలా

మంది వస్తారు." అని రశీదు రాసేసి డబ్బు తీసుకుని వెళ్ళిపోయింది. సుమిత్ర చెప్పినదీ నిజమే. కాని నాకు వీలవుతుందా అన్నదే నా సమస్య.

నెల నెలా తనే వచ్చి చందా వసూలు చేసుకుని వెళ్ళిపోయ్యేది సుమిత్ర.

తరువాత ఆరునెలల కాలంలో నేను ఏవొకటి రెండుసార్లో అక్కడికి వెళ్ళి ఉంటాను. క్లబ్‌లో నన్ను ఒక్కరూ మాట్లాడించిన పాపాన పోలేదు. పైగా కొందరు నన్ను పైనుంచి కిందికి ఎగాదిగా చూశారు. సుమిత్ర కనబడే వరకూ నాపని పొద్దున పడిన చేపవంతు అయింది. ఒకనాడు సుమిత్రవచ్చి చెప్పింది. "వొచ్చే స్వతంత్ర దినం సందర్భాన క్లబ్‌లో ఆటలపోటీలు ఏర్పాటు చేస్తున్నారు. నేను అన్నిటిలోనూ పాల్గొంటున్నాను. నువ్వూ పాల్గొంటావా ?" అని అడిగింది.

"నేను పాల్గొననుగాని, వొచ్చి చూస్తానులే" అన్నాను. అక్కడికి సంతృప్తిపడి వెళ్ళిపోయింది సుమిత్ర. ఆనాడు సాయంత్రం మూడింటికి పోటీలు చూద్దామని వెళ్ళాను. జనం బాగానే వచ్చారు. బయట కుర్చీలు



వేశారు ఒకటీ, అరా ఖాళీ కుర్చీలు ముందు వరసలో వుండటాన నేను వెళ్ళి ఒకదానిలో కూర్చున్నాను

ఆటల పోటీలు బాగా జోరుగా సాగుతున్నాయి దాదాపు ప్రతిదానిలోనూ సుమిత్ర పాల్గొంటూ వున్నది చాలావాటిలో గెలుపుకూడా సాధిస్తున్నది ఇంతలో క్లబ్ మనిషి నా దగ్గరకువొచ్చి చెవిలో రహస్యం చెప్పినట్టు చెప్పింది

"మీరు కూర్చున్న కుర్చీ సెక్రటరీ గారికోసం వుంచింది వారు ఇప్పుడు వస్తున్నారు మీరు ఖాళీ చెయ్యగలరా?" అని నేనులేచి ఒక ప్రక్కగా నిలబడ్డాను

నల్లకళ్ళజోడు సవరించుకుంటూ మోహన చిర్నవ్వు వెలిగిపోతూ వుండగా అందరి దగ్గర్నుంచీ నమస్కారా లందుకుంటూ వొచ్చింది రాజీరెడ్డి గారు నన్ను చూసీ, చూడనట్టు నటించింది

"ఆమె ఎవరు?" తెలీనట్టు నా ప్రక్క నేనుంచున్నావిడని అడిగాను "ప్రాజెక్టు మేనేజరుగారి భార్య రాజీరెడ్డిగారు క్లబ్ సెక్రటరీ" అందామె వింతగా నావొంక చూస్తూ

"రాజీరెడ్డేమిటి? ఆవిడ పేరు రాజీనా?" అన్నాను.

"కాదండి. ఆయనపేరు రెడ్డిగారు ఈవిడ అసలుపేరు రాజమ్మగారు ఫేషన్కని రాజీ అయింది. అంతే" అని ఆమె ఆ మాత్రం తెలియదా అన్నట్టు మొహంపెట్టి ఆటలు చూడటంలో మునిగిపోయింది.

రాజీగారు ఎవర్నో తనపక్కన కూర్చున్నావిడని అడుగుతున్నారు మందహాసంచేస్తూ

"'గేమ్స్'లోఎవరు వస్తున్నారు?"

"సుమిత్రండి"

"ఏ సుమిత్ర? "ఎమ్" సైడు సుమిత్రా? లేక "పీ" సైడు సుమిత్రా?"

"పీ సైడువేనండి"

"వ్ఁ! ఈ పీ సైడు వాళ్ళకి తిండి తక్కువగదా! జీతాలూ తక్కువాయె! తెలివి మనుషులు బాగా పరిగెడతారు మరి!!" అని బిగ్గరిగా నవ్వింది "జోక్" కట్ చేసినట్టు చుట్టుపక్కల వాళ్ళు శ్రుతి కలిపేరు, మెప్పుకోసము నాకు అక్కడ ఉండ బుద్ధిగా లేదు

అగస్టు పదహారున తనకువచ్చిన "కప్పు"లన్నీ చూపించింది సుమిత్ర నా సంతోషం తనకి తెలియ పరిచాను వెళ్తూ, వెళ్తూ "రేపు ఎమ్ సైడులో ఒకామె ట్రాన్స్ఫర్యి వెళ్ళిపోతున్నారు క్లబ్బులో ఆమె గౌరవార్ధము పార్టీ ఏర్పాటు చేస్తున్నారు నువ్వూ వస్తావా?" అని అడిగింది రానని తల అడ్డంగా వూపాను "అన్నట్టు జ్ఞాపకం వచ్చింది. మాకూ కొద్ది రోజులలో

ఎమ్ కైవు ఇస్తారుట!" అందిఅదో పెద్ద విశేషమైనట్టు సుమిత్ర.

నాకు, ఆటల పోటీలు జరిగిన వాడు రాజీగారు అన్నమాటలు జ్ఞాపకం వచ్చాయి. లోలోపల నవ్వుకున్నాను. సుమిత్రనిచూసి జాలి వేసింది. తనూ మారిపోతున్నది! వాతావరణం అట్లాంటిదిమరి!

పదిరోజులతరువాతనుకుంటాను, మావారునన్నడిగేరు. "మీక్లబ్బులో పార్టీ ఏర్పాటు చేస్తున్నారటగా?" అని. నాకు ఆశ్చర్యం కలిగింది. "ఏమిటి? ఎందుకుట?" అన్నాను.

"శేషగిరి అన్నాడు. సుమిత్ర చెప్పిందట! నీకు రమణి వాళ్లు తెలుసుగా? వాళ్ళకి మద్రాసుకి బదిలీ అయింది. ఈ నెలలోపునే వెళ్ళి పోవాలి. రమణి గౌరవార్థం పార్టీ చేస్తారుట క్లబ్‌లో. మరి సుబ్రహ్మణ్యానికి మీరేమి చేస్తున్నారని ఇందాక శేషగిరిని సుమిత్ర అడిగిందిట!"

మౌనంగా వింటూ ఉండిపోయాను. శేషగిరి సుమిత్ర భర్త.

"మేము పెద్దగా చేసేది లేదు గాని, నేనూ శేషగిరీ కలిసి ఒక్క వస్తువు ఉపయోగకరమయినది కొని సుబ్రహ్మణ్యానికి ఇద్దామనుకుంటు



న్నాము ఎదో నువ్వూ సహకరిస్తే తలావొక కప్పు కాఫీచాలు" అన్నారు నవ్వుతూ వారు. అట్లాగేనని తలూపేను.

వారంరోజులయి, ఈమధ్యన తిరిగీ సుమిత్ర కనబడలేదు నాకు. ఆరోజు ఉదయమే నన్నుపిలిచి "మిస్టర్! ఇవ్వాళే పార్టీ. సుబ్రహ్మణ్యం రిటైరై పోయాడు. సాయంత్రం కాఫీల పూచీ నీది సుమా" అని హెచ్చరించారు వారు. సరేననిమాట ఇచ్చాను. నలుగురికి ఏర్పాట్లు చెయ్యమని చెప్పారు వారు.

ఆ మధ్యాహ్నం సుమిత్ర వొచ్చింది. తనకి ఆసంగతి చెప్పి, "రమణికి పార్టీ ఇచ్చేరా క్లబ్బులో?" అని అడిగేను. సుమిత్ర మొహం అదోలా పెట్టి, "నేను క్లబ్బులో లేను ఇప్పుడు. ఏమిటోలెద్దూ" అని అన్నది. "ఏం?" అన్న ఆశ్చర్యంతో కూడిన నాప్రశ్నకి సమాధాన మేమీలేదు. నేను మరి సుమిత్రని నొక్కి అడగలేదు ఆ విషయం.

ఆ సాయంత్రం సుమిత్రా, రమణీ, సుబ్రహ్మణ్యంగారూ, శేషగిరిగారూ వచ్చారు. మేడమీద ఆరుబయట కుర్చీలు వేసుకుని కూర్చున్నాము. చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాము. లేడీస్ క్లబ్ లో నుంచి లైటు బయటికి దూసుకుని వచ్చి ఎదురుగా వున్న రావి చెట్టు మీద పడుతూ వున్నది.

కాఫీలయేక సుబ్రహ్మణ్యంగారికి ఒక ఖరీదయిన పెన్ను బహుమతిగా ఇచ్చారు మావారూ, శేషగిరిగారూ. వాళ్ళు వెళ్ళటానికి లేచేటప్పటికి బాగా పొద్దుపోయింది. మర్నాడే రమణీవాళ్ళు మద్రాసు వెళ్ళిపోతారు.

వెనకాల నడుస్తూవున్న నా చెవి దగ్గర నోరుపెట్టి సుమిత్ర అన్నది. క్లబ్ లో నుంచి వస్తున్న వెలుతురు చూశావా? నాకు ముళ్ళుగుచ్చినట్లనిపిస్తున్నది చూస్తూంటే. రమణికూడా మెంబరేగా? రమణికి పార్టీ ఇవ్వాలని అన్నాను నేను. అందరూ కాదన్నారు. రాజీరెడ్డిగారుమరీను. దానికి వాళ్లు చెప్పిన కారణంతెలుసా? పీ మైపువాళ్ళకి కూడా పార్టీ ఇవ్వాలేమిటి? నెమలికీకాకికివంతా?" అంది రాజీరెడ్డి. పీ మైపులో వుంటే మనుషులు కారనికాబోలు! ఎమ్ మైపులో వుంటేనే పార్టీకి అర్హులట! నేను మాట్లాడలేక ఇవతలకి వచ్చేశాను. క్లబ్బు మానుకున్నాను. ఇప్పుడు హాయిగా ఉందినాకు" అని అంటూ నాచేయి నొక్కివదిలిపెట్టింది సుమిత్ర.

***

(ఈ కథా, ఇందులోని పాత్రలూ పూర్తిగా కల్పితాలు. —రచయిత)




( గత సంచిక తరువాయి )

## 4వ రంగం

**అదే రంగస్థలం :** తెర తీసేటప్పటికి, భానుమూర్తీ, ఇందిరా సోఫాలో కూర్చుని వుంటారు. ఇందిర నిన్నటి ఉత్తరం చదువుతూ ఆలోచనలో వుంటుంది. తలుపు చప్పుడయ్యేటప్పటికి ఆతృతగా ఉలిక్కిపడి చూస్తారు. పోలయ్య కూరగాయల సంచీతో వచ్చి లోపలికెళ్ళిపోతాడు. మరో క్షణం తర్వాత రంగనాథం నెమ్మదిగా అడుగు లేసుకుంటూ దిగులుగా తలదించుకుని ప్రవేశిస్తాడు.

భా. అడుగో! ఏం రంగనాథం! ఏం జరిగిందీ?

రం : నమస్కారం బాబూ, నమస్కారమమ్మా. అయ్యగారు యింకా లేవలేదాండీ?

ఇం : లేవడానికి నిద్రపోతేగా! ఇంతకీ ఏం జేసుకొచ్చేవు?

రం : భానుమూర్తిగారు పథకం వెయ్యడంలో అపర చాణక్యులు. మరి తిరుగుంటుందాండి!

భా : నువ్వాంజనేయుల్లాంటి వాడివి.

ఇం : ఏమిటీ ! ఇద్దరూ ఒప్పుకున్నారా ! వాళ్ళు స్త్రీలా, పిశాచాలా ?

రం : వాళ్ళ దోషం లేదమ్మా. గత్యంతరంలేక ఒప్పుకున్నారు. అసలు వాళ్ళిద్దరూ కూడా చాలా బుద్ధిమంతుల్లాగ ...

భా : నీ వ్యాఖ్యానం మానేసి జరిగిందేదో చెప్పు. చాలు.

రం : మొదట మీ ఆజ్ఞప్రకారం, ఆ ఉత్తరం రాసిన అమ్మాయి దగ్గిర కెళ్ళానండి. ఆ అమ్మాయికి తల్లి తప్ప ఎవరూ లేరండి. బతికి చెడిన కుటుంబం అనుకుంటాను పాపం !

భా : పాపం పుణ్యం సంగతి కేంలే !

రం : సంగతంతా విని గొల్లుమన్నారండి. ఇంక చూసుకోండి ఆ అమ్మాయిని తల్లి తిట్టింది! రామ, రామ ! వినలేకపోయాను. ఆ అమ్మాయి మటుక్కు, చెప్పొద్దండీ ! బంగారు బొమ్మ ! మొహంలో లక్ష్మీదేవి తాండవిస్తుందంటే నమ్మండి.

భా : ఏమీ తాండవించకపోతే యిలా బరితెగిస్తుందా ?

రం బాగా చదువుకుంది కూడానండి అదేదో కంపెనీలో రెండు వందలు జీతం

భా : ఆ వుద్యోగం ధైర్యంచూసుకునే యీ ప్రణయ సాహసాలు.

ఇం : మన బంగారం మంచిది కానప్పుడు ఇతరుల్నని ఏం లాభం !

భా : ఇలాంటి ఆడాళ్ళుండబట్టే కదా మొగాడు తప్పుదారి పట్టడం!

ఇం : ఆ అమ్మాయిని గురించి మరీ అన్యాయంగా మాట్లాడకు అన్నయ్యా ! పాప పుణ్యాలు భగవంతుడికి తెలుసు.

రం : మంచిమాటన్నారు తల్లీ.

భా : మంచి మాట·కేంగాని, నువ్వు మరీ చచ్చు పీనుగులాగ పడి వేలూ యిచ్చి దణ్ణం పెట్టేసి వొచ్చావా ! నేను చెప్పినవిషయం.

రం : మంచిపనే ! తమకున్న వ్యాపారజ్ఞానం లేకపోవచ్చుగాని, లౌక్యం తెలియదంటారా ! ఆమాట యీమాట చెప్పి "అసలు మీకూ చంద్రంగారికీ ఎలా పరిచయం ? ఈ ఘోరానికి ఆయనే కారణమని సాక్ష్యాలేమయినా వున్నాయా ? ఫొటోలుకాని వుత్తరాలుకానివుంటే చూపెట్టండి. మా అయ్యగారికి చూపెడదాం. ఆయన ధర్మాత్ములు" అంటూ గేలం వేశాను. ఏమీ లేవుటండి. ఏమిటో సూర్యుడు చంద్రుడూ సముద్రం సాక్ష్యమంటే కోర్టులో కేసు నిలబడుతుందా ! అబ్బే! అసలాపాటి తెలివితేటలా అమ్మాయికి లేందే !

భా మనవాడు మరీ అంత దద్దమ్మకాదని సంతోషించు

ఇం మనవాడి ఘనకార్యాన్ని పొగుడుతున్నావా। ఎంత కడుపు తీపయినా వాడి అవినీతిని సమర్ధించే టంతటి దుస్థితికి దిగజారలేదు

భా అయిపోయిందేదో అయిపోయింది వాడిదీ తెలిసీ తెలియని వయస్సు మొదటే మేలుకుని తొందరగా పెళ్ళిచెయ్య వల్సింది సరే। ఈ గతజలసేతుబంధన మెందుకుగాని చివరికేం జరిగిందోయ్?

రం అబ్బాయిగారికి పెళ్ళి నిశ్చయమై తాంబూలాలు పుచ్చుకున్నట్టూ ఆ అమ్మాయి రాసిన వుత్తరంచూసి జాలిపడి మా అయ్యగారు డబ్బు పంచినట్టూ చెప్ప తల్లిచేతులో డబ్బు పెట్టానండి పుచ్చుకోవద్దని ఆ అమ్మాయి తలుపు కేసి తల బాదుకుంటూనే వుందండి ఆపళంగా ఆతల్లి నీ తెలివి తక్కువ వల్ల కలిగిన యీ దురదృష్టానికి సాయం దిక్కు లేని చావుకూడా ఎందుకు చావడం। పద రేపు యీ వూరు విడిచి పోదాం అంటూ ఆ అమ్మాయిని సముదాయిస్తుండగా నేను చల్లగా జారుకున్నాను

ఇం ఎం మహాపాపం చేసుకున్నామో ఈ మానసిక చిత్రహింస అనుభవిస్తున్నాం

భా ఏదో మీరు చేసుకున్న పూర్వజన్మ పుణ్యం వల్లనే ఈ గండం యింతటితో గడిచింది ఊ తర్వాత ఆ రెండో అమ్మాయేమయిందీ?

రం తర్వాత తిన్నగా ఆ సంగీతం టీచరింటి కెళ్ళేనండి వెళ్ళేటప్పటికి వీణమీద సంగీతం సాధనచేసుకుంటోందండి వీణ వాయిస్తూండగా ఆ అమ్మాయిని చూస్తూంటే అహాహా। సాక్షాత్తూ సరస్వతీదేవి లాగ

భా ఆహాహ। మళ్ళీ కవిత్వం

రం చిత్తం చిత్తం తమరు చెప్పమన్నట్టుగానే విషయాలన్నీ చెప్పేనండి దీని కోసం యింత శ్రమపడి రావడం దేనికి। ఇప్పుడు నేనేమయినా పెళ్ళికోసం బెంగెట్టుకున్నానా। అసలీ విషయంలో మీఅయ్యగారితో చెప్పనుకదా। అందండి

ఇం ఏ విషయం?

రం తల్లి తండ్రుల్లో ఎవరి కిష్టం లేకపోయినా చంద్రంగార్ని పెళ్ళాడ్డాని తనే ఒప్పుగోనని అయ్యగారితో ఆవిడ చెప్పిందిటండి నిజంగా ఆ అమ్మాయి మాటతీరూ ఆ గౌరవం ఆ మర్యాద

భా నీ కాండక్టు సర్టిఫికెట్ కేంలే। తర్వాతేం జరిగిందో చెప్పు

రం అసలు తమ సంబంధం గురించి చంద్రంగారెప్పుడూ ఆ అమ్మాయితో ప్రస్తావించలేదుటండి

భా : ఆఁ ! అలా అనక ఏమంటుం దిలే !

రం : తర్వాత యీ వుత్తరం గురించిచెప్పి యిలాంటి విషయాలు దాచడం ఆయనకేం కొత్తగాదు అన్నానండి. దాంతో తారా జువ్వలా లేచిపోయి అబ్బాయిగార్ని అనరాని మాటలన్నారండి. ముందర డబ్బిస్తే పుచ్చుకోలేదండి. తర్వాత ఏమను కున్నారో యేమో ! సరేనని పుచ్చుకున్నారండి.

ఇం : (సోఫాలోంచి లేచి మెట్ల వైపు అడుగులేస్తూ) హుఁ ... పాపం !

భా : పాపం లేదు, పుణ్యంలేదు. ఏదో చదువుకుందికదా ! ఆ మాత్రం బెట్టు చెయ్యొద్దూ!

ఇం : (చర్రున వెనక్కి తిరిగి) అన్నయ్యా ! నువ్విలా స్త్రీలను గురించి మరీ యింత చులకనగా మాట్లాడటం సహించలేను. నేనూ ఓ ఆడదాన్నే. కన్నకొడుకు బ్రతుకు బ్రద్దలవుతుందేమోనన్న భయంతో, మమకారంతోమలినమైనమనస్సుతో అనుబంధ బాంధవ్యాలంటూ అర్థం పరమార్థం లేని స్వార్థంతో ఆ అమ్మాయిలపట్ల అక్రమంగా ప్రవర్తిస్తున్నాం. ఇదికాక వాళ్ళని నిందించడం దేవుడుకూడా క్షమించని దారుణం. ఆమాటకొస్తే చంద్రం చెయ్యని తప్పు వాళ్ళు మాత్రం ఏం చేసేరు ! స్వాతంత్ర్యం, నాగరికత, సంస్కృతి పేర్లతో మానవ సమాజం సృష్టించుకున్న కృత్రిమ వాతా వివేకాన్ని ధిక్కరించిన కారకల ఫలితం యిది.

రా : (మెట్లు దిగి వస్తూ) హియర్ ! హియర్ !ఏమిటిపొద్దున్నే అధ్యక్షోపన్యాసం మొదలెట్టేవు !

ఇం : (ఆవేదనతో) వచ్చేరా ! రండి. ఈ భయంకర మానసిక సంక్షోభాన్ని నేను భరించలేను.

రా : (అనునయంగా)నువ్వేమీ భరించొద్దు. భరించువాడు భర్త అన్నారు. నేనున్నానుగా, ప్లీజ్. ఇందిరా ... ఇలా రా. ముందీ సోఫాలో కూర్చో. ఊ ... ఏమి టున్నావు ! భయంకర మానసిక సంక్షోభమా ! అబ్బ ! అలాంటి కఠినమైన సంస్కృత పదాలు పలుకు తుంటేనే గుండెలు దడదడ లాడ తాయి కదా ! ఎందుకు చెప్పు యీ ఆవేశం ! (కూర్చోపెట్టి) ఆఁ... ఏమిట్రాభానూ; ఏం జరిగిందీ ?

భా : ఆఁ... ఏముందీ ! ఆడాళ్ళ తెలివితక్కువ లిలాగే వుంటాయి ! నిన్నరాత్రి వరకూ "అన్నయ్యా యీగండం ఎలాగైనాతప్పించంటూ" బేరమంది. తీరా యివ్వాళ తప్పిం చిందాకా వుండి వాళ్ళ కన్యాయం చేశాం మొర్రో అంటుంది. కర్ర విరగా కూడదు, పాము చావా కూడదు అన్న సామెతలాగుంది.

రా : ఏమిటి ! పెళ్ళి తప్పిం చేశావా !

భా: ఒరేయి రాజా, అవ్వా కావాలి బువ్వా కావాలి అంటే ఎలాగ చెప్పు! మా అమ్మాయి నిచ్చి పెళ్ళి చెయ్యడం యిష్టమే అంటావు. ఇప్పుడేమో దాన్నెవర్తినో తీసుగొచ్చి కట్టబెడతానంటావు! ఇన్నాళ్ళూ మిమ్మల్ని నమ్ముకున్నాను. నేనేమైపోయినా సరే నన్నమాట!

రా: భానూ, నీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. రాత్రి చంద్రం గురించి యివన్నీ విన్నాక "మీరు మీ అబ్బాయీ గంగలో దూకండి" అని లేచి చక్కా పోతావేమో ననుకున్నాను. ఇంతకీ యివన్నీ తెలుస్తే మీ అమ్మాయి ఒప్పుగుంటుందా!

భా: మా అమ్మాయి దగ్గిర నామాటకి తిరుగు లేదు.

రా: బతికించేవు. అసలు వీళ్ళిద్దర్నీ ఎలా వొదిల్చేవు!

భా: డబ్బోయ్ డబ్బు. నువ్వు తీసుగొచ్చి పెళ్ళి చేస్తానన్న అమ్మాయికి పదివేలూ, వాడు పెళ్ళాడతానన్న అమ్మాయికి ఐదు వేలూ పారేసేటప్పుడికి గప్ చుప్.

రా: ఇద్దరినోళ్లూ నొక్కేశావన్న మాట!

భా: మరేమిటనుకున్నావు. అంతా నాప్రతిభ కాదనుకో. ఇదిగో నా సారథ్యంతో రంగనాథం సాధిం [redacted]

రం: నాదేముందిలెండి. అంతా తమచలవే! నిన్న రాత్రి...

రా: ఒద్దు రంగనాథం అవన్నీ నాకు చెప్పకు పాపమో పుణ్యమో ఇదంతా ఓ పాడు కలగా మరిచిపోదాం. ఇక నయినా చంద్రాన్ని సరయినమార్గంలో పెట్టి వాడి జీవితాన్ని సరిదిద్దాలి... ఇంతకీయిప్పుడు చంద్రం వొచ్చి గంతులెయ్యకుండా చూడాలి.

భా: ఆ సంగతి నా కొదిలెయ్యి- డబ్బు పారేస్తే వాళ్ళిద్దరూ వాళ్ళ ప్రేమాస్త్రాల్ని ఉపసంహరించుకున్నారా లేదా! ఈ విషయం వాడికి రాగానే చెప్పి" హెచ్చరిచవటూ! వాళ్ళ ప్రేమ యింతలో వుంది. అలాంటి వాళ్ళను నమ్ముకుని జీవితయాత్ర మొదలెడితే కుక్కతో కట్టుకుని గోదావరీదటమే!" అని నచ్చ చెబుదాం.

ఇం: అన్నయ్యా అలాంటి నిస్సహాయ స్థితిలో వాళ్ళు డబ్బు పుచ్చుకోడం నీచమయితే, ఆ పరిస్థితికి కారణమైన మనం డబ్బిచ్చి నోరు నొక్కడం అంతకంటే నీచం కాదంటావా!

భా: నీ ధోరణి మరీ బాగుంది. నువ్వు ప్రాధేయపడ్డావనేగా యిన్ని రాయబారాలు జరిపేను! నీ కిష్టం లేకపోతే చెప్పు — నా దారిన నేను పోతాను.

రా: అబ్బ! భానూ! ఇందిర [redacted] మాట్లాడితే ఆవేశం, దాంతో అయాసం, ఆపైన నీరసం! ఇంత

వరకు వొచ్చేక ఇంక వెనక్కి, ముందుకూ లాగితే వ్యవహారం తేలి నట్టే!

ఇం: ఇది మనం తేలుస్తే తేలే వ్యవహారం కాదు. వాడి ఖర్మం వాడిది!

భా: అది కాదు అమ్మడూ, ఈ నిర్ణయం నిన్ననే చెప్పలేక పోయావా! రాత్రి రైలుకే పోయి వుందును.

రా: నిన్న నువ్వు రైలెక్కితే, మా ఆవిడపోరు భరించలేక, ఇవ్వాళ పొద్దున్నే బైరాగుల్లో కలిసిపోయి వుందును. (ఇందిరవైపు తిరిగి) నువ్వలా తొందరపడటం చాలా




తెలివితక్కువ రాత్రి నేనుకూడా ఆవేశపడ్డానుకో ఇలాంటి విషయాల్లో నిదానం అవసరం వాడి ఖర్మం వాడిదని ఏదో ఆవేశంలో అన్నానుకాని, రేపట్నుంచి వాళ్ళ జీవితం మన జీవితంలో ఓ భాగం కాదూ!

భా: ముక్కూ మొహంతెలియని పిల్లనిచ్చి పెళ్ళిచేస్తే ఎన్ని చిక్కులు!

రా: టెరిఫిక్!

భా: డబ్బు కోసం గడ్డితినేవాళ్ళెంత ఘోరమైనా చేస్తారు.

రా: ష్యూర్!

భా: అంత్యనిష్ఠూరంకంటె ఆది నిష్ఠూరం మంచిది. అందుకే ఏదో తెగతెంపులు చేసి పొమ్మంటున్నాం.

రా: కరెక్ట్!

ఇం: ఇదంతా మీకు న్యాయంగా తోస్తోందా! దీనికిచంద్రం సమ్మతిస్తాడా?

రా: న్యాయమని మనం నిర్ణయించినప్పుడు గౌరవించడం వాడి విధి.

ఇం: వాళ్ళ మొహాన్ని డబ్బు పారేసి పొమ్మనడం న్యాయమని నిర్ణయించేరా!

భా: ఏమిటమ్మడూ, మనం చేసిన అన్యాయం! అసలు ఆ డబ్బా యివ్వకపోతే వాళ్ళు చెయ్యగలిగిందేముందీ!



గా : రైట్ ! ఏమీ లేదు. ఏమయ్యో గోయ్యో చూసుకోవాలి.

భా : నిజంగా వాళ్ళకి నీతీ నియమం వుంటే ఎంత బలవంతం చేసినా డబ్బు తీసుకోరు.

రా : వెంటనే మొహాన్నేసి కొడుదురు.

సంధ్య : (ప్రవేశించి) వెంటనే మొహాన్నేసి కొడితే పదిమందీ పోగవుతారు. అల్లరవుతుంది. అందుకే మర్యాదగా తిరిగి యిచ్చేద్దామని వొచ్చాను. (నోట్లకట్టలు టీపాయ్‌మీద పెడుతూ) ఇదిగో మీ డబ్బు.

భా : ఎవరీ అమ్మాయి ?

రా : సంధ్య అనీ ... ఫైనార్ట్స్ స్కూల్లో ... అదే అయిదు వేలు బాపతు !

భా : ఓ ! నువ్వేనా ?

సం : అవును. మీ కాబోయే అల్లుణ్ణి ప్రేమించింది నేనే.

భా : శభాష్ ! నీకు సిగ్గూ లజ్జా కూడా లేవన్నమాట !

సం : సిగ్గెందుకూ ! మేము ప్రేమించుకున్నట్టు మీకు తెలుసుగా ! మీ అమ్మాయికి కాబోయే వరుణ్ణి అపహరించకుండా, నాకు అయిదు వేలు పరిహారం పంపేరు !

భా : నీకక్కర్లేకపోతే కిక్కురుమనకుండా యిక్కడ పడెయ్యి. నిర్బంధం లేదు.

ఇం : అన్నయ్యా ! ఏమిటీ అమర్యాద ! రా అమ్మా రా. ఇలా కూర్చో.

సం : (కూర్చుంటూ) కిక్కురుమనకుండా వుండటానికి రాలేదు.

రా : పోనీ అలాగే కి క్కు రు మందువుగాని. కాస్త ఆవేశం తగ్గించుకో. ఆవేశం అంటువ్యాధిలాంటిది. ముఖ్యంగా మా ఆవిడకి ఆవేశంగాలి తగుల్తేచాలు రాక్షసి బొగ్గులాగ రగుల్కొంటుంది. తర్వాత రైలింజన్ లాగ పొగలు కక్కుతుంది. ఊఁ... ఇప్పుడు చెప్పు, నువ్వెందుకొచ్చినట్టు.

సం : మరో అమ్మాయి తో చంద్రానికింత సన్నిహితమైన పరిచయ మున్నట్టు నాకు తెలియదు. రంగనాథంగారు రాత్రి చెబుతుంటే నమ్మలేక పోయాను. ఆ అమ్మాయిని కలుసు కుందామన్న వుద్దేశంతో ఎడ్రస్ తెలుసుకోడాని కొచ్చాను. రంగనాథంగారు ఎడ్రస్ చెప్పడానికి మీ అనుమతి కావాలన్నారు.

భా : చూడు మిస్ సంధ్యా. ఆ అమ్మాయి సంగతి మేం చూసుకుంటాం. పాపం! నీ కెందుకా శ్రమ !

సం : అమ్మమ్మ! అలా అనకండి. నేను పెళ్ళాడకుండా వుండటానికి ఐదు వేలిచ్చారు. ఆ అమ్మాయి పెళ్ళాడకుండా వుండటానికి పది వేలిచ్చారు. మరి యీ వ్యాపారంలో ఒకవేళ మీ అమ్మాయి కూడా చంద్రాన్ని పెళ్ళాడకుండా వుండాలంటే మీరెంత పుచ్చుకుంటారు !

భా : షటప్.

రా : భానూ, అవేశపడకు. ఏమిటమ్మాయ్ పెద్దంతరం చిన్నంతరం లేకుండా! నిజానికి మేం ముగ్గురం ఆలోచించే మీ నష్టానికి పరిహారం నిర్ణయించేం. ఇష్టం లేకపోతే మానెయ్యి. చాలకపోతే చెప్పు.

సం : మీకో కూతురుండి ఆ కూతురే యిలాంటి పరిస్థితుల్లో వుంటే ...

రా : మిస్ సంధ్యా !మర్యాదగా మాట్లాడు. నాకో కూతురువున్నా ఈ స్థితిలో వుండదు.

సం : ఒక కీర్తి ప్రతిష్టలు సంపాదించిన ఓ న్యాయవాదికీ ఓ మహిళా సంఘ సేవికకీ జన్మించిన మీ సుపుత్రుడే కదా యింత చేశాడు. మీ అబ్బాయికి లేని బుద్ధి మీ అమ్మాయికి మాత్రం ఎక్కణ్ణుంచొస్తుంది ?

రా : నీ మాటలు హద్దు మీరుతున్నాయి. ఎందుకింకా ఆ అమ్మాయిని వెనకేసు గొస్తావు! డబ్బు తీసుకుందా లేదా !

భా : అదీ! అలా అడుగు. డబ్బుకు డబ్బూ గుంజుకుంది మధ్యన ఆ అమ్మాయి పాతివ్రత్యం గురించి యీ అమ్మాయో ఉపన్యాసం! ఎిరగబడి నవ్వుతారని సిగ్గేనా లేదు !

సం : ఆ అమ్మాయి కడుపునపుట్టే శిశువు పెరిగి "నాన్నా నాన్నా" అని ఎలుగెత్తి ఏడ్చినప్పుడు ఈ సంఘం విరగబడి నవ్వేరోజు గాక పోదు. అప్పుడు సిగ్గుపడే దెవరో,

ఆ వునురు ఎవరికి తగుల్తుందో ఆలోచించుకోండి.

ఇం : భగవంతుడా ! మా కెందుకిలాంటి శిక్ష విధించేవు !

భా : అడదిన్న తర్వాత ఒళ్ళు కాస్త దగ్గర పెట్టుకు బతకాలి.

సం : ఏం ! ఈకట్టుబాటు మొగాడికి వర్తించదా ! నీతీ నిగ్రహం స్త్రీ పురుషులిద్దరికీ అవసరమే. ఆవేశంలో అవివేకంగా ప్రవర్తించిన నేరాని కిద్దరూ బాధ్యులే.

ఇం : కాని ... దాచినా దాగని శరీర పరిణామం స్త్రీ నేరానికిప్రత్యక్ష నిదర్శనం. అంచేత స్త్రీ శిక్ష అనుభవిస్తుంది. పురుషుడు తప్పించుకుంటాడు.

భా : తప్పించుకోడ మేమిటి ! అసలు ఆ అమ్మాయికీ చంద్రానికీ సంబంధం వున్నట్టు రుజువేముంది ? రేపొద్దున్న వాడొచ్చి నాకేం తెలియదు పొమ్మంటాడు. అప్పుడూ !

రా : అంటాడేమిటి అన్నాడట. ఉత్తరంలో రాసిందిగా !

సం : చంద్రం ఇంత అమానుషంగా ప్రవర్తిస్తాడనుకోలేదు. అయినా అతని మంచితనంలో యింకా నాకు నమ్మకం పోలేదు. మనమందరం ప్రయత్నంచేస్తే మనతో సహకరించి జీవితాన్ని చక్కదిద్దుకుంటాడు.

భా : రంకునేర్చింది బొంకునేర్వదా అని ! ఆ అమ్మాయి మాటట్టుకుని ...

సం : ఆ అమ్మాయి మాటట్టుకుని పెళ్ళీ చెయ్యొద్దు. మీ మాటట్టుకుని అన్యాయం చెయ్యొద్దు. చంద్రం వచ్చిన తర్వాత నిజానిజాలు విచారిద్దాం. ఈలోగా ఆ అమ్మాయి ప్రయాణం ఆపండి. చేతులారా యీలోకంలో మరో అనాధని సృష్టించకండి.

రా : (చేతి గడియారం చూసి) అసలు చంద్రం యీపాటికి రావల్సిందే ! వొచ్చినా వాడొప్పుగోడు. వాడొప్పుగున్నా, మేమొప్పుగోం.

సం : (ఇందిరతో) అమ్మా ! మీరు మహిళామండలిఅధ్యక్షురాలు. ఇదేనా మీ మహిళాసేవ ! ఎంతసేపూ వినోదాలూ, విహారాలూ, సభలూ, సమావేశాలూ సన్మానాలూ సంతాపాలూ యేనా మీఆశయాలు? మీ కన్నకొడుకు చేతుల్లో ఓ అమాయిక స్త్రీ అన్యాయానికి అధర్మానికీ బలయి పోతుంటే మీరు చెయ్యకలిగిందింతేనా !

ఇం : తల్లిగా క్షమించి ప్రేమించే హృదయం వుంది కాని వాడి నేరానికి శిక్షించే ఆత్మబలం లేదు. అధర్మాన్ని సహించే ఓర్పువుంది కాని ప్రతిఘటించే నేర్పు లేదు. నేను స్త్రీని, తల్లిని అబలని.

సం : అయితే చూస్తూ చూస్తూ చేతులారా కన్నకొడుకుని ఈ పాపకూపంలోకి తోస్తారా ! ఇదా మీ మతం ! ఇదా మీ ధర్మం ! ఇదా మీ సంస్కారం !

ఇం : భగవాన్ ! ఎందుకు మాకీ అగ్నిపరీక్ష !

భా :(సంధ్యతో) చూడమ్మాయ్ ! నువ్వు చెప్పిన సలహాలు వర్తించే కుటుంబాలు వేరు. మాకు కొన్ని సంప్రదాయా లున్నాయి.

సం : ఏమిటి మీసంప్రదాయం ! మీ అమ్మాయి కో పెళ్ళికొడుకు కావాలని మరో అమ్మాయి భర్తని అపహరించడమేనా !

భా : పెళ్ళికీ వ్యభిచారానికీ తేడా తెలుసుకోడానికి నీతీ జాతీ వుండాలి. పాపం ! నీ తప్పులేదు.

సం : నీతీ, జాతీ అంటూ మితి మీరి కూతలు కూస్తూ సొంత డప్పు వాయించుకునే చెత్తడబ్బాను కాకపోయినా అధర్మాన్ని సమర్థించే మానవమృగాన్ని మాత్రం కాదు.

భా : ఆఁయ్ ! ఏమన్నావ్ !

సం : ఉన్న మాట.

రా : ఆఁ ఆఁ ... చూడమ్మాయ్. ఏమిటా పొగరుబోతుతనం.

ఇం : ఆ అమ్మాయి తప్పే మీ లేదు. ధర్మం ఎత్తి చూపెట్టింది. అన్నయ్యా ! క్రిందటి జన్మలో ఏ మహా పాపం చేశామో, ఈ జన్మలో మా బ్రతుకు లిలా ఫలించేయి. మళ్ళీ యీ జన్మలో ఆ తల్లీ బిడ్డల వుసురు మనకొద్దు.

భా : కులం గోత్రం లేని కులట నీకు కోడలుగా వచ్చే దుర్గతి నీ మొహాన్ని రాసి వున్నప్పుడు నా సలహా నీ కెందుకు నచ్చుతుందీ!

సం : ఆచరణలో పెట్టగల ఆత్మ శుద్ధి లేకపోయినా న్యాయాన్ని గౌరవించే సంస్కారమైనా వుందను కున్నాను మీకు.

భా : సంస్కారం మీ అమ్మా, బాబూ ద్వారా నీకు సంక్రమించిన ఆస్తి. నా కెక్కణ్ణుంచి వొస్తుందీ !

రా : అబ్బబ్బ! కాస్త స్తిమితంగా కూర్చుని పరిష్కరించుకోవాలి కాని ...

భా : మీ కవసరం కనక తీరు బడిగా కూర్చోండి. ఈ అవమానం నాకు చాలు. మిమ్మల్ని పట్టుకు వేళ్ళాడ్డం నాదే బుద్ధి తక్కువ ! ఈపాటి సంబంధం నాకు దొరక్క పోదు.

ఇం : అన్నయ్యా, ఈ మాట నేనే అందా మనుకుంటున్నాను. ఇంత ఘోరాని కొడిగట్టిన చంద్రానికి మీ అమ్మాయి నిచ్చి పెళ్ళి చెయ్యడానికి నీ మనస్సెలా ఒప్పుతోందో అర్థమవటంలేదు.

సం : ఆస్తి చూసి. నీతి నిజాయితీలో ఆయన కెంత నమ్మకముందో కనబడుతూనే వుంది.

భా : మాటలు నేర్చిన కుక్క ఇస్కో అంటే ఇస్కో అందిట !

సం : కాని, నేను మీలాగ కక్కిన కూటికి కక్కుర్తిపడే కుక్కను మాత్రం కాదు.



["నోర్మూయ్" అంటూ ఆవేశంలో భానుమూర్తి సంధ్యవైపు రెండడుగులు వేసేలోగా రాజశేఖరం అడ్డు నిలబడి "ఏమిటీ గందరగోళం! ఇది ఇల్లా, కురుక్షేత్రం నాటకమా! ఒద్దు ఒద్దన్నకొద్దీ ఒకళ్ళకంటే ఒకళ్ళు పేట్రేగిపోతున్నారే! (తువ్వాలుతో మొహం తుడుచుకుంటూ) మైగాడ్! ధోరణి చూస్తే ఖూనీలు జరిగేటట్టుంది. ...

ఇం : అన్నయ్యా, ఆవేశంలో ఈ అమ్మాయి హద్దుమీరి మాట్లాడినందుకు ఈ అమ్మాయి తరపున నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను.

రా : మాయింట్లో నీకిలాంటి అవమానం జరిగినందుకు ...

భా : చాలు చాలు. ఈ మర్యాద చాలు.

ఇం : అన్నయ్యా, చంద్రం పెళ్ళి విషయంలో ఇంక ఆలోచించవల్సిందేమీలేదు. ఇప్పుడే వెళ్ళి కోడల్నింటికి తీసుగొస్తాను.

భా : ఛీ! ఇంత దౌర్భాగ్యస్థితికి నువ్వు దిగజారతావనుకోలేదు. (లేచి బయటకి నడుస్తూ) ఛీ ఛీ! ఈ నరకంలో ఒక్కక్షణం వుండలేను.

రా : భానూ, భానూ, భానూ (భానుమూర్తిని వెంబడిస్తాడు).

సం : నా తెలివి తక్కువ మన్నించండి. మీ ఔదార్యానికి కృతజ్ఞురాల్ని. మీరింత దయా సముద్రులనుకోలేదు.

ఇం : లేదమ్మా, నీ పొగడ్త కర్హురాల్ని కాను. ఉదయం వరకూ సందిగ్ధావస్థలో వున్నాను. నీ సాన్ని

ధ్యమే నాకు కర్తవ్యాన్ని నిర్ణయించు కునే ఆత్మబలాన్నిచ్చింది.

సం : మీపవిత్రమైన నిర్ణయంతో సమాజంలో రావలసిన మార్పుకు దారి చూపెట్టండి. పదండి మనమిద్దరంవెళ్ళి ఆ అమ్మాయిని తీసుకొద్దాం.

ఇం : నిన్నటి వరకూ నువ్వంటే అసహ్యించుకున్నాను. ఇప్పుడు నీ అభిమానంతో సిగ్గుపడేలా చేస్తున్నావు.

సం : ఛా. అలా అనకండి. చంద్రం స్నేహితుడుగా నా జీవితంలో ఓ భాగమై పోయాడు. అతని మంచిచెడ్డలు నాకు మాత్రం ముఖ్యం కావా ! ఓ అభాగ్యురాలికి అన్యాయం జరక్కుండా ఆదుకోడం నా ధర్మం కాదా !

ఇం : నిన్ను కోడలిగా పొందే అదృష్టం లేకపోయినా, నీకు క్షమాపణ చెప్పుగుని నీ సహాయం అర్థించే స్థితికి తీసుగొచ్చి భగవంతుడు నాకోపాఠం నేర్పాడు. నీసహకారంతో మనిషినయ్యాను. మనస్సు తేలిక పడింది. పదమ్మా పద.

రా : (ప్రవేశించి గంభీరంగా) ఆగండి. ఎక్కడికి !

ఇం : కోడల్నింటికి తీసుకు రావడానికి.

రా : తొందర పడుతున్నావు, ఇందిరా.

ఇం : నిదానంగా ఆలోచించే నిశ్చయించుకున్నాను. ఇక వ్యవధి లేదు.

సం : ఆలస్యం చేస్తే ఆ అమ్మాయి ఫూరు విడిచి పోవచ్చు.

రా : (తీక్షణంగా) సంధ్యా !! గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందిట !. నువ్వా మాకు సలహా యివ్వడం ? నువ్వెవరు ! నీకూ మాకూ ఏమి టీ సంబంధం ! ఎవరిచ్చారు నీకీ అధికారం !

సం : అన్యాయాన్ని ఎదిరించడం మానవ ధర్మం.

రా : నీపాటిధర్మ విచక్షణాజ్ఞానం మాకు లేక పోలేదు. ఇప్పటికే నీ ధోరణి శ్రుతిమించింది. (చేత్తో ద్వారం వైపు చూపుతూ) ఇకనైనా మర్యాదగా ...

సం : నేను యీ అవమానానికి సిద్ధపడే వొచ్చాను. సరే నే వెడతాను.

ఇం : ఆగమ్మా. ఆగు. నేనూ వస్తున్నాను. నాకూడా వస్తానని మాటిచ్చావు.

రా : ఇందిరా, మన బ్రతుకులు బజారుపాలు చెయ్యడానికి భానుమూర్తి చాలక ఈవిడతో కూడా సంప్రతించాలా ! వాడి పెళ్ళి విషయంలో మనం కలగజేసుకోకుండా నోరు మూసుకు వూరుకుంటే వాడే డుపు వాడేడుస్తాడు. వాడుఆఅమ్మాయినే పెళ్ళాడతాడో ఈఅమ్మాయినే పెళ్ళాడతాడో !

సం నన్ను పెళ్ళాడ్డానికి మీ అబ్బాయి సిద్ధంగా వున్నా, ఈ పరిస్థితుల్లో మీ అబ్బాయిని పెళ్ళాడేటంత నైతిక పతనానికి నేను సిద్ధంగా లేను.

రా నిన్ను కాకపోతే మరో పిల్లని పెళ్ళాడుతాడు లేకపోతే పెళ్ళే ఆడక పోవచ్చు మధ్య నీకెందుకీ నీతులూ, యీ నిట్టూర్పులూ, యీ త్యాగాలూ !

ఇం ప్రతి చిన్న విషయంలోనూ న్యాయం ధర్మం అంటూ ఉపన్యాసాలిచ్చే మీరేనా, యీ మాట లంటున్నది!

రా కొడుకు తప్పుచేస్తే భరించగలం కాని, జీవితాంతం వరకూ యీ నరకం అనుభవించలేం

ఇం ఏ నరకం !

రా ఆ అమ్మాయిని చంద్రం పెళ్ళాడ్డం నిజంగా నీకు సంతోషంగా వుందా! మనసారా ఒప్పుకుంటున్నావా! మన మతం కాదు, మన కులం కాదు మన సంప్రదాయం కాదు ఏదో తాత్కాలికమైన ఉద్రేకంలో యిలాంటి పెళ్ళికి మనం ఒప్పుకున్నా మన దురదృష్టాన్ని మనం నిందించుకుంటూ మనశ్శాంతిని కూడా పోగొట్టుకుంటాం.

ఇం పొరపాటు పడుతున్నారు. ఇంతవరకూ మా అన్నయ్య కూతుర్ని చంద్రం పెళ్ళాడలేదని బాధపడ్డాను. చంద్రం యింతటి దారుణం చేశాడనగానే క్రుంగి పోయాను. పది మందిలో నూ నవ్వుల పాలవుతున్నామే అన్న దుఃఖంతో గుండె బద్దలయ్యింది ఆ నైరాశ్యంలో కర్తవ్యం తెలుసుకోలేకపోయాను అంతే కాని జాతి కుల మత భేదాలనే దృష్టితో ఆ అమ్మాయంటే నాకు ద్వేషం లేదు ఆ అమ్మాయిని మన సారా కోడలుగా స్వీకరిస్తాను వాళ్ళ జీవితం ఆనందమయం చేస్తాను.

రా అనుకుంటున్నావు!

ఇం నాకా నిశ్వాసం వుంది. జాతి మత కుల భేదాలు మానవుల అజ్ఞానానికి అహంభావానికి చిహ్నాలు. రవీంద్రనాథ్ ఠాగూర్ చెప్పినట్టు యివన్నీ మానవుడు సంకుచిత స్వభావాలతో నిర్మించుకున్న గోడలు.

రా . ఇవన్నీ పాత నినాదాలే. ఎప్పొచ్చి నువ్వింత సంఘ సంస్కర్తవనుకోలేదు

ఇం ఇది సంఘ సంస్కారం కాదు ఆత్మ సంస్కారం. దయుంచి యింక అడ్డు చెప్పకండి.

రా ఏమిటీ తొందర! అసలు వాడికీ ఈ అమ్మాయికీ సంబంధం వుందో లేదో !

సం . ఇప్పుడు వెళ్ళిం తర్వాత తేలిపోతుందిగా !

రా . సంధ్యా ! సభ్యతా సంస్కారం లేకుండా ఏమిటీ ప్రవర్తన!

చం (చేతిలో సూట్ కేసుతో ప్రవేశించి) నాన్నా! సంధ్య ప్రవర్తనలో అసభ్యత కనబడితే సంజా

యిషి నే నిచ్చుకుంటాను దయుంచి యింక ఆమెను యేమీ అనకండి.

రా (కూర్చుంటూ) ఓ హెూ! నోరు మూసుకో మంటావు !అవునా! అవును. ప్రియురాలు కదా !

చం : కాదనుకుంటే పోయే అనుబంధం కాదు.

ఇం : నోర్ముయ్. దౌర్భాగ్యుడా! ఎంతమందిరా నీకు ప్రియురాళ్ళు ! రెండు రోజుల్లో యిద్దర్ని చూశాం. (ఉత్తరం మీదకి విసిరి) ఏమిటి దీని కర్థం !

చం : (గంభీరంగా) ఏమిటి సంధ్యా ! ఏం జరిగిందీ !

సం : ఏం జరిగిందో ఆవుత్తరంలో వుంది. ఏం జరగాలో యిప్పుడు తేలాలి. చంద్రం ! మనం మనుషుల మన్న జ్ఞాపక ముంచుకుని కర్తవ్యం నిర్ణయించు.

చం : (ఉత్తరం చదివి) ఏమిటిది ! ఏమిటీ దారుణం ! ఎవరీ రాక్షసి ! ఎందుకీ పన్నాగం ! ఎవరు రాశారు! ఎవరు రాయించారు! ఎవరు! ఎవరు! ఎవరు ! (ఉత్తరం మరోసారిపరీక్షగా చూసి) ఈ దస్తూరీ ... అవును (గట్టిగా ఎలుగెత్తి పిలుస్తూ) రంగనాథం ... రంగనాథం ... రంగనాథం !

ఇం : చంద్రం ఏమిటిది !

రం : (పరిగెత్తుకొచ్చి) బాబూ ! ఏమిటబ్బాయిగారూ,అలా కేకేట్టేరు!

చం : (రంగనాథం కోటుకాలరు పట్టుకుని) నిజం చెప్పు. ఎవర్రాశారీ వుత్తరం ? ఎవర్రాశారు ?

రం : బాబూ ! బాబూ ! నేనే రాశాను.

సం : ఆఁ ... అంటే అలాంటి అమ్మాయి లేదా !

రం : లేదండి.

చం : (కాలరు వొదులుచేసి) ఎందుకు రాశావు ? ఎవర్రాయమన్నారు ?

రం : చిత్తం. అయ్యగారు రాయమన్నారండి.

సం . (రాజశేఖరం వైపుతిరిగి) మీరా !

ఇం : మీరు రాయించారా !

చం : (రంగనాథాన్ని వదిలేసి) నాన్నా ! మా పెళ్ళి ఆపాలంటే నువ్వొక్క మాట చెబితే చాలదా ! ఎందుకీ కుతంత్రం ! నువ్వు రాయించావా !

రా: అవును. నేనేరాయించాను మీరందరూ ఒక్క క్షణం నోరు మూసుకుంటే కారణం చెబుతాను. దీనికి కారణం ఇందిర.

ఇం : నేనా !

రా ! అవును డార్లింగ్ నువ్వే. చంద్రం నీ కిష్టంలేని పిల్లని పెళ్ళి చేసుకోకుండానూ. నీకిష్టమైనపిల్లనే చేసుకోవాలని నాదగ్గిర రెండు వరాలు పొందావు. ఇంత గ్రంధం నడిపించాను కనక నే ఇందిర యిటు సంధ్యా అటు భానుమూర్తి, వాళ్ళిద్దరి నిజ స్వరూపాలూ తెలుసుకుంది.

ఇం . మా అన్నయ్య నిజస్వరూపానికేంగాని, దైవికంగా సంధ్యా దర్శన మైంది

సం : దైవికం కాదనుకుంటా. ఇదీ నాటకంలో ఓ భాగమే అయి వుండాలి. ఎంచేతంటే రాత్రి రంగనాథంగారు ఆ అమ్మాయిని గురించి ఆ వుత్తరాన్ని గురించి ఒకటే కంట తడి పెడుతూ చెప్పి, ఆ అమ్మాయి ఎడ్రస్ యివ్వడానికి నిరాకరించి, వొద్దంటున్నా డబ్బక్కడ పడేసి నమస్కారంచేసి వెళ్ళి పోయారు. అంచేత నన్ను రప్పించడానికే ఆ యెత్తువేసి వుండాలి

ఇం .అసలీ వుత్తరం రాయమని ఎప్పుడు చెప్పారు !

రం. నిన్న తమరండదూమాట్టాడుకుంటూండగా బయటకొచ్చి బ్యాంక్ నుంచి యిరవై వేలు తెమ్మనీ యిలా వుత్తరంరాసిటపాతో అక్కడికి పత్రుమ్మనీ రాయబారానికి ఒప్పుకోమనీ బోధించారండి.

ఇం : రంగనాథం, నువ్వు కూడా నాకింత ద్రోహం చేస్తావా !

రం : అమ్మమ్మ ! అంత మాట నకండి. ఇంక మీదట మీపక్షవే !

ఇం : (సంధ్య వాపస్ చేసిన రూపాయిల కట్ట రంగనాథంపై విసిరి) ఛీ ! ఇంకా నమ్మమంటావు ! కేస్ డిస్మిస్.

రం. అమ్మా ఏకంగా ఐదువేలే! కోడలిగారి కిచ్చిన సొమ్ము.

రా (జేబులోంచి ప్రేమలేఖల కట్ట తీసి) సంధ్యకి అది చాలదట, అంతకంటే పెద్దకట్టే యిస్తున్నాను. (సంధ్యకిస్తూ) ఇవిగోనమ్మా మీ ప్రేమలేఖలు

చం క్షమించు నాన్నా! తొందర పడి ఏమిటో అన్నాను. మా పెళ్ళికి.

రా నాన్ సెన్స్! నే నొప్పు కోను మీ అమ్మకిష్టంలేని పెళ్ళి

ఇం ప్లీజ్! వీళ్ళిద్దరికీ త్వరగా పెళ్ళిచేస్తే ఈ మహిళా మండలి అధ్యక్ష పదవికూడా నె మ్మ ది గా సంధ్య కప్పజెప్పేసి మీపాదసేవ చేస్తూ కూర్చుంటాను.

రా ఆల్ రైట్. ఆ షరతుమీద ఒప్పుకుంటాను

పో. (ట్రేలో కాఫీ ఫలహారాలు తెచ్చి) చినబాబుగారికి చిన్నమ్మ గార్కి మేడమీద పెట్టానండి.

ఇం. ఇదెవరుపురమాయించారూ?

పో. పొద్దుకే సెప్పేసినారయ్య గారు. (నిష్క్రమణ).

రా (ఫలహారంప్లేటందుకుంటూ) వెళ్ళండి. వెళ్ళండి. కాఫీ చల్లారి పోతుంది.

ఇం (చంద్రం సంధ్య చెయ్యిపట్టు కుని మెట్లువైపు లాక్కెడుతుండగా) ఏమండీ! ముహూర్తంకూడా పెట్టే వుంచారా! అదికూడా చెప్పి యీ నాటకం పూర్తి చెయ్యండి.

రా. అఁ! తొందరేముందిలే! ఏకంగా బారసాలా పెళ్ళీ ఓసారే చేద్దాం మనుకున్నాంగా!

ఇం ఛా! వూరుకోండి ... మొత్తంమీద కోడలు చాలా గట్టి దండి!

రా. నొక్కి చూశావా!

(తెర)

(సమాప్తం)



# ఆ పక్షి!

నీ అనురాగమయమూర్తి
నన్ను వెలిగించిన ప్రేమ జ్యోతి
        మరిచిపోయాగాని ఎప్పుడో !
        జ్ఞాపకమొస్తోం దిప్పుడు
పసిపాపనై జారి క్రింద పడ్డప్పుడు
రెక్కపట్టుకు లేవతీసే దానివి కాకుండా చప్పుడు
గాయానికి కట్టుకట్టి
మాయా మంత్రాలుపెట్టి
ఓదార్చేదానివి
కన్నీళ్ళు పెట్టుకునేదానివి
        నిన్నెలా మరచిపోయాడీ మూర్ఖుడు
        ఎన్నాళ్ళకు తలుచుకుంటున్నాడో
                చూడు కృతఘ్నుడు.

బ్రతుకు చీకట్లో ఎదురు దెబ్బతిన్నప్పుడు
చెయ్యిపట్టుకునే వాళ్ళులేక చతికిల పడ్డప్పుడు
చూట్లుపడ్డ ఈ శరీరంమీద
ఈగ వాలితేబాధ
వేడికన్నీళ్ళ వరద
నా అన్నవాళ్ళు లేరనే వ్యథ
        గుర్తు తెస్తోందా రోజును
        నీలో కనపడ్డ మార్పును

రెక్కలొచ్చి రాకముందే
సంచారానికి సమయమే కాందే
అన్నితెలిసిన ఆరిందాలా
నిన్నువిడిచి వచ్చేయలా ?
నే నొచ్చేస్తుంటే నువ్వు చూసిన చూపు
కాంతిహీనంగా కనుపించిన రూపు
        మరిచిపోయాగాని ఎప్పుడో,
        జ్ఞాపకమొస్తోందిప్పుడు.

— జనార్ధన్

# ఎందుకీ గొప్పలు?

కుమారి ఎస్. మంజుల

మనుషులు ఎందుకు గొప్పలు చెప్పుకుంటారో? మానవుల బలహీనతలలో యిది వొకటా? లేక దానివలన యేదైనా అనిర్వచనీయమైన ఆనందం, సంతృప్తి పొందుతారా?

ఆమధ్య ఒకావిడ మాయింటికి వచ్చింది ఆవిడకి గొప్పలు చెప్పుకోవడం మహా సరదా "మా ఇంట్లో అయిదారు సేర్ల పాలు రోజూ వాడతాం" అని గొప్పగా చెప్పుకుంది వాళ్ళు కాస్త వున్నవాళ్ళే అయినా జాగ్రత్తకోసం ఆఖరికి చిన్నపిల్లలకి కూడా కాఫీయే పడతార్ట. అలాంటప్పుడు, అయిదారు సేర్ల పాలు వాళ్ళింట్లో ఖర్చు అవుతాయని అందరినీ నమ్మమనా ఆవిడ వుద్దేశం?

ఒక మధ్యతరగతి కుటుంబీకుడు, పాపం నిత్యం, పెళ్ళాం పిల్లల రోగాలతో వేగలేక బాధపడుతుండేవాడు అతనికి యేదో ఆస్పత్రితో సంబంధం వుండడంవల్ల మందులు, టానిక్కులు ఊరికే వచ్చేవిట ఆ మహా యిల్లాలు మాత్రం ఆ మందుల గురించి గొప్పలు చెప్పుకోడంతో కాలక్షేపం చేసేది "ఆస్పత్రిమందులు మేము వాడం. అవి పెట్టుకుని మా పిల్లలు ఆడుకుంటా"రని అందరితో చెప్పి ఆవిడ సంతోషించేది అంటే వాళ్ళు దేవలోకంనించి అమృతం తెచ్చుకుని తాగి జబ్బులు తగ్గించుకుంటారు కాబోలు

ఇంకా కొందరికి అస్తమానం తమకి వున్నవి, మిగతా వాళ్ళకి లేనివి (తమకి వున్నా లేకపోయినా) చర్చించడం, తద్వారా గొప్పలు చెప్పుకోవడం అంటే సరదా మాకు తెలిసినావిడ ఒకావిడ అస్తమానం చీరలకి రంగులు మార్పించేసి అవి కొత్త చీరలని చెప్పుకొనేది ఒక పార్టీలో ఆవిడ తన స్నేహితురాలితో ఇలా అంటుండగా విన్నాను "అబ్బా, అదేమిటో గానీండి, శారదాంబగారు, విమలమ్మగారు యే పార్టీకి వచ్చినా ఒకే చీర కట్టుకుంటారు నాకు మహా చికాకు ఋమండీ ప్రతి ఒకపార్టీకి మా ఆయన నాకు కొత్త చీర పట్టుకు రావలసిందే" వాళ్ళాయనకి 250 రూపాయల జీతం - నలుగురు పిల్లలు. ఇది తెలిసినవాళ్ళు మటుకు చాటుగా నవ్వుకున్నారు

ఈ తరహా గొప్పలు చెప్పుకొనే జనాభాలో ఆడవాళ్ళ సంఖ్య యెక్కువగా వుండడం శోచనీయం అక్కడో, యిక్కడో యే ఒకళ్ళో

తప్ప యేయిల్లాలు, కూడా నాలుగు కూరలు, ఆరు పచ్చళ్ళకి తక్కువ చేశానని వొప్పుకోదు. మరీ ధరలు పెరిగి పోతున్న ఈ రోజులలో అన్ని వంటలు రోజుకి యెలా చేయగలరో నా వూహాకి మటుకు అందదు. ఎప్పుడేనా పొరపాటున చిన్న పాపల్ని "ఈ రోజు మీ యింట్లో వంట యేంచేశారు పాపా" అని అడిగితే టకీమని జవాబు చెప్తారు. "మాయింట్లో యివాళ పుట్టి పప్పు చారేనండి. నెలాఖరు కాబట్టి కూరలు కొనడానికి డబ్బులేదుట" అని. పాపం గొప్పలు చెప్పుకోవాలని పిల్లలకేం తెలుసుంది?

ఇంకా యిలాంటివేమనంయెన్నో వింటూ వుంటాం ప్రతిరోజూ. మనం జాగ్రత్తగా వినాలేగాని, గొప్పలు చెప్పుకొనే వాళ్ళు మనచుట్టూ వుంటారు. తాము యెంత తెలివి తక్కువగా మాట్లాడుతున్నారో, తమని చూసి చాటుగా యెంతమంది నవ్వుతున్నారో గ్రహించలేని వాళ్ళ అమాయకత్వానికి నిజంగా జాలి వేస్తుంది.

ఇలా వుంటాయి (ముఖ్యంగా ఆడ వాళ్ళ) గొప్పలు. దీనికి యేమైనా నివారణ వుందా? లేక కలియుగం అనుకుని దేవుడికి దండంపెట్టి వూరుకుందామా?

***



# కలలోని గాలిమేడ

ఎమ్. సూరిబాబు

ఆ రోజు సాయంకాలం, కాలేజీ ఆడిటోరియం, ఇసుక వేస్తే రాలకుండా జనంతో కిటకిట లాడుతోంది. అప్పటికి నాలుగురోజులుగా కాలేజి సిల్వర్ జూబిలీ ఉత్సవాలు ముమ్మరంగా సాగుతున్నాయి. ఈనాడు కాలేజీ పాత విద్యార్థుల మధ్య ఉపన్యాసపు పోటీలు, అంతకంటె యింకా విశేషం ఏమిటంటే, ఒకానొకప్పుడు యీ కాలేజీలో చదువుకున్న ఒక విద్యార్థిని ఈనాడు ప్రఖ్యాత సినిమాతారగా పేరు పొందిన ఒకామె యీనాటి పోటీకి ఒక పెద్ద వెండి షీల్డు బహుమతి ఇవ్వటానికి అంగీకరించి యీ సభకు స్వయంగా విచ్చేసింది.

ఆవిడ రావటం తరువాయి సరాసరి లోపలికి వెళ్ళిపోయింది. ఆవిడ వచ్చిందని తెలియగానే అశేషజనం, ఎగ్జిబిషన్ స్టాల్సులో వుండవలసిన జనంతోసహా ఆడిటోరియంకు పరుగెత్తుకుంటూ వెళ్ళారు. కాలేజీ ఆవరణ అంతా నిర్మానుష్యం. అంటే యీమాట నూటికి నూరుపాళ్ళు నిజంకాదనుకోండి. ఆడిటోరియం వరండాలో యిద్దరే యిద్దరు అమ్మాయిలు నిలబడి వున్నారు. ఈనాలుగు దినాలుగా అక్కడ జనసమూహం చూపులన్నీ యీ చిన్నారుల యిద్దరి మీదనే. అది వారి సౌందర్య మహిమ.

ఇంతలో అందమైన కారు ఒకటి ఆ వరండాలోకి వచ్చి ఆగింది. అందులోంచి ఒక అందమైన అబ్బాయి దిగి యిటువైపుచూశాడు. ఆ చూపుకు వీళ్ళు యిద్దరూ త్రిభంగిగా నిలబడ్డారు. రెండు జడల అమ్మాయి ఒక జడ వెనక్కు వేసుకుంటే, తల్లో పెట్టుకున్న మల్లెచెండు కనబడేలాగా ఒంటిజడ అమ్మాయి జడ ముందుకు వేసుకుని ముడివేసుకున్న రిబ్బను ముడి విప్పి యింకొకసారి ముడివేసుకుంది.

ఆ వ్యక్తిని చూడగానే ఆ అందమైన విగ్రహం, ఆ కళ్ళలో కనబడే స్నేహం, దర్జా డాంబికంలేని గొప్పతనం చూస్తూంటే వీళ్ళ ఇద్దరి మనస్సుల్లో వెయ్యి ఆలోచనలు మసలాయి అతడు తమవైపే రావడం చూసి.

తమ్ము పలుకరించడం కోసమే వస్తున్నాడనే ఆలోచన రాగానే, ఆ పిల్లలిద్దరి హృదయాలు ఒక్క క్షణం ఆగిపోయినంత పనైంది.

“నేను ఎంతో లందగత్తెను. నా అందం మెచ్చుకున్నాడు” అని ఎవరి

మనస్సుల్లో వాళ్ళు గర్వంగా అనుకున్నారు.

అతను దాపుకు రానే వచ్చాడు. వీళ్ళకు రెండడుగుల దూరంగా వుండగానే –

"హలో!!" అని అన్నాడు.

సిగ్గుతో వాళ్ళిద్దరూ మరింత కుదించుకుని పోయారు.

ఎక్కడికైనా పారిపోతే బాగుండును అని వాళ్ళకు అనిపించింది. "పరాయి ఆడ పిల్లలను ముక్కూ మొహం తెలియని వాళ్ళను పలకరించే ధైర్యం యితనికి ఎవరు యిచ్చారు?" అని కోపం వచ్చింది.

"మా యిద్దరిలో ఎవరిని పలకరించాడు?" అనిసందేహంవచ్చింది.

"హల్లో!" అంటూ ఒక పురుష కంఠం వెనుకనుంచి బదులు పలికింది.

ఉలిక్కిపడి యిద్దరూ వెనక్కి తిరిగి చూశారు.

వైస్ ప్రిన్సిపాల్ కృష్ణమూర్తి గారు అటునుంచి వస్తున్నారు. మరుక్షణం అతని చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు,

"మీరు మరిచిపోకుండా వచ్చారు. ఐ యామ్ వెరిగ్లాడ్!" అని అన్నాడు.

ఆడపిల్లలు యిద్దరూ ఒక్కసారి గతుక్కుమన్నారు. మరుక్షణం అక్కడనుంచి మాయమైనారు. మాయమైన వాళ్ళు మీటింగుహాల్లో ప్రత్యక్ష మయ్యారు. ఉపన్యాసపు పోటి ప్రారంభం కావటానికి ఒక అరనిమిషం మాత్రం వ్యవధివుంది. ప్రార్థన జరిగింది.

అధ్యక్షుల వారు వేదిక నలంకరించారు. ఉపోద్ఘాతంగా ప్రిన్స్‌పాల్ గారు రెండు ముక్కలు చెప్పారు.

"ఈనాడు చాలా సుదినం! మన కాలేజీలో విద్యనభ్యసించి కృతార్థులై జీవిత రంగంలో అడుగుబెట్టి అభివృద్ధి సోపానంలో ఎన్నో మెట్లు పైకి వచ్చి, నలుగురిచేత ఔననిపించుకున్న గొప్ప వ్యక్తులు కొందరు ఈనాడు యీ ఉత్సవంలో పాల్గొనటానికి వెంటనే అంగీకరించడం వారి సద్గుణ సంపత్తికి, వారికి ఈ విద్యాసంస్థయందు అంటే ఈ మాతృసంస్థయందు గల అనురాగానికి తార్కాణం..."

"ఈ ముసలి వాళ్ళతో యిదే చిక్కు. మొదలుపెడితే ఆగారు." అని రెండు జడల అమ్మాయి విసుక్కుంది.

ఆమె విసుగుదల ఆయన గ్రహించాడో ఏమో,

"ఈనాటి పోటీకి ఉపన్యాస విషయం" 'నాజీవన లక్ష్యం.' ప్రతి వక్త అయిదు నిముషాలసేపు మాట్లాడవచ్చు. గుడ్‌లక్ టు ఆల్" అంటూ కూర్చున్నాడు.

"అమ్మయ్యా!" అని కథానాయికలు యిద్దరూ ఒక్కసారే అన్నారు.

గంట మ్రోగింది. టీ. బీ.

పేషెంటులాంటి ఒక అమ్మాయి వేదిక మీదకు వచ్చి నిలబడింది.

"మిస్. తులసి. ఎమ్. ఎ. సోషియాలజీ. ప్రస్తుతం రీసెర్చి చేస్తున్నారు" అని ఆవిడని గురించి ఎరుక పరిచారు

"విశ్వశాంతి నా జీవన లక్ష్యం !" అంటూ ఆవిడ అయిదు నిమిషాలు, వరద వచ్చినంత బీభత్సంగా, జనం దద్దరిల్లి పోయేటంత భయంకరంగా మాట్లాడింది జనం తెప్పరిల్లుకునే లోపలే వెళ్ళి పోయింది.

విన్నవాళ్ళంతా "వాన వెలిసింది" అని అన్నారు.

"మిస్టర్ బలబీర్! ఆటో మొబైల్ యింజనీరు" అని పేరు వినగానే ఆరడుగుల పొడవు, రెండు వందల యాభై పౌనుల వ్యక్తి వేదిక మీదకు వచ్చాడు.

"అధ్యక్షా ! సోదర ! సోదరీమణులారా !" అంటూ అతను గొంతుక విప్పగానే, జనం ఒక్క క్షణం బిచ్చబోయి మరుక్షణం ఫక్కున నవ్వారు. అతను కూడా ఒక్క క్షణం చిరునవ్వు నవ్వాడు. బ్రహ్మదేవుడికి పూజా పునస్కారం లేక పోవటానికి కారణం ఏమిటో అప్పుడు అందరికి అర్థమయింది. అంతటి నిండైన విగ్రహానికి కెనెడియన్ ఇంజను కూతలాంటి కంఠస్వరం యివ్వకుండా, పదహారు సంవత్సరాల ముగ్ధకంఠం యిస్తే నవ్వు రాక ఏంచేస్తుంది.

"నా జీవన లక్ష్యం ఏమిటి ?" అంటూ అతను మొదలు పెట్టాడు.

"మల్లయుద్ధం ! అని ఎవరో సభలోంచి అన్నారు జనం మళ్ళీ గొల్లుమన్నారు జడ్జీల ముఖంలో కూడా రవ్వంత చిరునవ్వు కనిపించింది. తాము యీ పోటీకి జడ్జీలమన్న విషయం అంతలో గుర్తుకువచ్చి చిరునవ్వు మాయమై గంభీరముద్ర ముఖంలోకి మళ్ళీ వచ్చింది.

అతని తరవాత అధ్యక్షులు "మిష్టర్ శివరామ్ ఆఫ్ జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా" తరవాత వక్తని ఎరుక పరిచారు. అతను వేదిక పైన నిలబడ్డాడు. సభవారివంక ఒక్కసారి కలయ జూచాడు. ఆడవాళ్ళ గ్యాలరీవంక చూసినప్పుడు అతని పెదవులమీద చిరునవ్వు కనిపించింది.

"చాలా కొంటెవాడు లాగా వున్నాడే" అని ఒంటిజడ అమ్మాయి అన్నది.

"తనే అందగాడని మహాగర్వం" అని రెండుజడల అమ్మాయి అన్నది.

"గర్వించినా తప్పు లేదు లే" అంటూ ఒంటిజడ పలికింది.

ఒక బర్మాముడి కోపంగా వీళ్ళ వంక చూసింది ప్రక్కన కూర్చున్న కంజీవరం పట్టు చీరెతో ఏదో చెప్పింది వెనక వరుసలో కూర్చున్న "పోనీ టెయిల్" వీళ్ళ వంక ఒక్కసారి విసుగ్గా చూసి,

మళ్ళీ అంతలోనే దృష్టి మరల్చుకుని స్టేజి వంక చూసి "బావున్నాడు" అనుకుంది.

"సభవారికి నమస్కారం" అంటూ అతను రెండుచేతులు జోడించాడు. ఆ సంశి, ఆ పద్ధతి, సభలోని ప్రతి వ్యక్తికి ప్రత్యేకంగా నమస్కరించి నట్లు అనిపించింది. ఆ ఒక్కమాట లోనే అతను దాదాపు ప్రతివారికి ఆత్మీయుడులాగా కనిపించాడు—ముఖ్యంగా మన కథానాయికలకు.

"ఈ సభకు వచ్చేవరకూ నా జీవిత లక్ష్యాన్ని గురించి నేను ఎన్నడూ ఆలోచించలేదు. కాని జీవితంలో అనేక వసంతాలు గడిచిపోయాయి. జీవితంలో ఎన్నో సాధించాగనే గర్వ పడ్డాను. ఎన్నో సాధించగలననే ధైర్యం, ఆశతోనూ వున్నాను. కాని నా జీవిత మనేది యీనాటి వరకూ లక్ష్యరహితంగానే గడిచిందా ? ఈనాటివరకూ నాది గమ్యస్థానంలేని ప్రయాణమా ? ఈ ప్రయాసకు ఒక లక్ష్యం, ఆదర్శం లేనేలేవా ? అనే ఆత్మ విమర్శ నాలో బయలుదేరింది. పిలుపుకోసం నిరీక్షిస్తున్న యీ గంట వ్యవధిలో నేను ఇదే విషయం గురించి మనస్సులో మననం చేస్తూ కూర్చున్నాను. ఈ ప్రశ్నకు సమాధానం లభ్యమో ! అలభ్యమో నాకు తెలియదు. నాకు తెలిసినదల్లా ప్రాజ్ఞులైన మీ ఎదుట, నా సమస్యను విన్నవించి, కూలంకషంగాపరిశీలించ గలిగితే పరిష్కారం సుగమం, సులభం కాగలదనే ఆశతో మీకు మనవి చేస్తున్నాను.

విద్యార్థిగా, ఉద్యోగిగా ప్రయాణం అనేది నా జీవితంలో ఒక ముఖ్య భాగమయింది. లక్షలాది జనంతో కిటకిటలాడే పట్టణంలో యీనాడు గడిపితే, మరుసటి దినం నాగరికతకు దూరంగా – నాకు నేనే తోడుగా కారడవులలో, నిర్జన ప్రదేశాలలో అనేక రోజులు, వారాలు గడపవలసిన ఉద్యోగం నాది. భూగర్భశాస్త్రం వల్ల నేను భుక్తిని పొందగలుగుతున్నాను. కాని నా మనస్సుకు రక్తి, నా హృదయానికి తృప్తి నిరంతర విద్యాన్వేషణలోనే నాకు కనిపించింది. అంతులేని అపారమైన యీ జ్ఞాన సాగరాన్నుంచి, లభ్యమైనంత విజ్ఞానాన్ని స్వల్పమైన ఈ మానవ జీవిత కాలంలో పొందాలనేదే నా నిరంతర వాంఛ.

విద్య అనేది ఒక్క పుస్తకాలతోనే కాక, మానవ జాతి సాహచర్యంలో కూడా వున్నదని నా ఉద్దేశం. జీవితమంటే ఏమిటో పుస్తక విద్య చెప్పగలిగితే జీవించడమంటే ఏమిటో నేను మానవజాతి దగ్గర నేర్చుకున్నాను.

ఈ నిరంతర విద్యాన్వేషణ, తృప్తి లేని యీతృష్ణ నా జీవిత లక్ష్యమని, అదే నా గమ్యస్థానమని మీరంతా అంటే ఒప్పుకోవడానికి

నా కేం అభ్యంతరంలేదు... థాంక్యూ వెరీమచ్"

అంటూ సభవారికి నమస్కరించి వెళ్ళిపోయాడు.

"వండర్‌ఫుల్ స్పీచ్." అని అమ్మాయిలు ఇద్దరూ అనుకున్నారు.

'యస్' అని బర్మాముడి వంత పలికింది.

"సరిగ్గా గ్రెగరీపెక్‌లా వున్నాడు" అని పోనీ టెయిల్ అనుకున్నది.

తరువాత ఎవరెవరో వచ్చి మాట్లాడారు. ఏంమాట్లాడారో ఎల్లా మాట్లాడారో అనే విషయం వీళ్ళకు తెలియదు. పోటీ అయిపోయింది. ప్రైజులుకూడా ఎవరెవరికో




వచ్చాయి. అందులో ఒక ప్రైజు గ్రెగరీపెక్‌కు వచ్చింది. ఆ బహుమతిని యిస్తూ వెండితెర తార అతనితో :

"మీ ఉపన్యాసం నన్ను బాగా ఆకర్షించింది. నిరంతర విద్యాన్వేషణ ఒక తపస్సులాంటిది. ఆ తపస్సు ఫలించి, మీకు చక్కటివరం లభించాలని మా ప్రార్థన, కంగ్రాచులేషన్స్" అని అంది.

సభ ముగిసింది. సీతా, సావిత్రి వరండాలోకివచ్చి నిలబడ్డారు. జనం ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు. అంతా దాదాపుగా పూర్తిగా వెళ్ళిపోయిన తరువాత వైస్ ప్రిన్సిపాల్ గారి వెంట అతను యిటే వస్తున్నాడు.

"కంగ్రాచులేషన్సు చెబుదామా !" అని సావిత్రి అన్నది.

"డోన్‌ట్ బీ సిల్లీ" అని బదులు వచ్చింది.

"ఏం ?"

"ఎవ్వరూ యింట్రడ్యూస్ చెయ్యకుండా మాట్లాడితే ఏమనుకుంటాడు ?"

"చొరవగలవాళ్ళ మనుకుంటాడు."

"అల్లా అనుకోడు, వెకిలివాళ్ళ మనుకుంటాడు."

వీళ్ళ వాదం జరుగుతూనేవుంది. వాళ్ళు దగ్గరకు రానేవచ్చారు.

"మీ ఫిలాసఫీ ఆఫ్ లైఫ్ నాకు నచ్చింది." అని వైస్ ప్రిన్సిపాల్ గారు శివరాంతో అంటున్నారు.



అతను వీళ్ళను దాటి వెళ్ళిపోతూ ఒక మనోహరమైన చిరునవ్వు చిందించి వెళ్ళిపోయాడు.

అమ్మాయిలు యిద్దరూ మనస్సులో అందల మెక్కినంత సంబరపడ్డారు.

మళ్ళీ ప్రశ్న వెంటనే వచ్చింది: చిరునవ్వు ఏ చిన్నారికోసం అని.

"నన్ను చూసే నవ్వాడు" అని ఎవరికి వాళ్ళు అనుకున్నారు.

"ఏం పొగరు ?" అని ఒక పిల్ల అనుకుంది.

"థాంక్యూ" అని ఇంకొక పిల్ల బిగ్గరగానే అనుకుంది.

కారు ఎక్కి అతని త్రోవను అతను వెళ్ళిపోయాడు.

రోజులు వారాలు గడిచిపోయాయి. అతను వాళ్ళకు మళ్ళీ కనిపించలేదు. అతనిని గురించిన తలంపు వీళ్ళ మనస్సుల్లో మాసిపోయింది. ఆరోజు "హిండూ"లో రెండు వార్తలు పడ్డాయి. ఒకటి – ఎల్ఫిన్‌స్టన్‌లోకి గ్రెగరీపెక్ నటించిన ఒక చిత్రం వచ్చిందని – రెండవది – ప్రముఖ భూగర్భ శాస్త్రవేత్త మిష్టర్ శివరాంకు, "ఆర్యుల భాషలు, వాటి లిపి స్వరూపములు" అనే విషయంమీద జరిపిన పరిశోధనకు గవర్నమెంటు ఒక ప్రత్యేక పారితోషికం యిచ్చినదని.

మనసున దాగిన మాట మళ్ళీ బయటకు వచ్చింది. "అతను ఎక్కడ వున్నాడో? ఏం చేస్తున్నాడో!" అని ఇద్దరి హృదయాలలో అనిపించింది.

"సాయంకాలం సినిమాకు వెడదామా?–"అని అడిగింది సావిత్రి.

"ఓకె" అని సీత అన్నది.

సినిమా చూస్తున్నంత సేపు ఇద్దరి మనస్సుల్లో అతని బొమ్మే మసలుతోంది. వేడినిట్టూర్పులలో, అరని సెగలతో సినిమా గడిచింది.

"కూల్ డ్రింక్ త్రాగుదామా" అంది సీత.

రోడ్డుదాటి యిద్దరూ హోటలు ఎయిర్ లైన్సుకు వెళ్ళారు, అక్కడి సోడా ఫౌంటెను జనంతో కిటకిటలాడుతోంది. ఉన్న అన్ని బల్లల దగ్గర ఎవరో ఒకరు వున్నారు. ఒక బల్లదగ్గర సూట్ వేసుకున్న వ్యక్తి ఎవరో ఒంటరిగా కూర్చొనివున్నాడు. ఇంకొక బల్లదగ్గర ఒక్క కుర్చీ మాత్రం ఖాళీగావుంది. వీళ్ళు ఇద్దరూ ఒక్క క్షణం తటపటాయించారు.

అతను వెనక్కి తిరిగి చూశాడు. ఈ ఇద్దరూ ఒక్క క్షణం మూగపోయారు. అతను అతనే. గ్రెగరీ పెక్‌లాంటి శివరాం. వీళ్ళ పరిస్థితి గ్రహించాడో ఏమో!!

"మీరు ఇక్కడ కూర్చోండి. నేను యింకొక టేబుల్ దగ్గర కూర్చుంటాను" అని అన్నాడు.

"థాంక్స్" అని సావిత్రి అన్నది.

అతనులేచి ప్రక్క టేబుల్ దగ్గరకు వెళ్ళ బోయాడు.

"పరవాలేదు. మీరు కూడా కూర్చోండి" అని సీత ఆహ్వానించింది.

"మీకు ఇబ్బందేమో" ...

"ఇబ్బందేం లేదండి. కూర్చోండి" అని యిద్దరూ ఒక్కసారే అన్నారు,

"థాంక్యూ వెరిమచ్" అనిఅతను అన్నాడు.

"ఆమాట అనవలసింది మేము" అని సావిత్రి అన్నది.

వెయిటరువచ్చి వీళ్ళకు కావలసినవి ఆర్డరు తీసుకుని వెళ్ళాడు.

"మళ్ళీ ఎక్కడైనా ఉపన్యాసాలు యిస్తున్నారా ?" అని సావిత్రి అడిగింది.

అతను ఉలిక్కిపడి "ఐ బెగ్ యువర్ పార్డన్" అని అన్నాడు.

"కాలేజి సిల్వర్ జూబిలీలో మీరు మాట్లాడిన ఉపన్యాసం మేము విన్నాం. చాలా బాగుంది" అని సావిత్రి అంది.

"థాంక్యూ ... మీరుకూడా మా కాలేజీ స్టూడెంట్సా ?"

"అవును ... ఆరోజున మిమ్మల్ని కంగ్రాచులేట్ చేదామని అనుకున్నాం"

"థాంక్యూ ... మిస్ ..."

"నా పేరు సావిత్రి. నా ఫ్రెండ్ సీత."

"గ్లాడ్ టు మీట్ యూ ... నా పేరు శివరాం"

"మాకు తెలుసు, మళ్ళీ మీకు యింకొకసారి కంగ్రాచులేషన్సు చెబుదామని అనుకుంటున్నాం"

"దేనికీ ?"

మీకు గవర్నమెంటు ప్రైజు యిచ్చిందని చదివాం. చాలా ఆశ్చర్యం, ఆనందం రెండూ కలిగాయి."

"దేనికి ?"

"జియాలజిస్టుకి భాషల లిపిమీద బహుమానం వచ్చిందంటే, అతను ఎటువంటి జీనియస్సో తెలుస్తుంది."

"దానికేం "జీనియస్" అక్కర్లేదు. ఖనిజాలు, లోహాలేకాదు, పురాతన వస్తువులన్నింటితోనూ మాకు కొంతకాకపోతేకొంతపనివుంటుంది. మన పూర్వీకులని గురించి తెలుసుకునేటప్పుడు, వారి భాషా లిపి తెలుసుకోవడం ఎంతైనా అవసరం. ఆర్యుల భాష సంస్కృతం కాకపూర్వం, ఎటువంటి లిపి వుండేది అనేదే నా జిజ్ఞాస. అదే నేను వ్యాసరూపకంగా వెలిబుచ్చాను. అంతకుమించి దాంట్లో ఏం ప్రత్యేకతలేదు."

"వినయం గొప్పవారి లక్షణం" అని సావిత్రి అన్నది.

అతను ఒక్క క్షణం సావిత్రివంక పరకాయించి చూసి చిరునవ్వు నవ్వాడు.

"ఒక చిన్నమాట చెప్పనా ?" అని అన్నాడు.

సావిత్రి అతనివంకనే చూస్తూ వుండిపోయింది.

"చెప్పండి" అని సీత అన్నది.

మీ ఫ్రెండు ప్రెస్ రిపోర్టరుగా బాగా రాణిస్తారు."

సావిత్రి ఉలిక్కిపడ్డది.

"ఎందుకలా అన్నారు ?" అని సీత అడిగింది.

"చొరవా, మంచితనం, ధైర్యం, యీ మూడు ఆ ఉద్యోగానికి కావలసిన లక్షణాలు. అవి మీ ఫ్రెండు దగ్గర సమృద్ధిగా వున్నాయి."

సావిత్రి ముఖంలో రవ్వంత కోపం కనిపించింది.

తరువాత వీళ్ళిద్దరూ లాంఛనంగా అభ్యంతరం చెప్పినా, అతనేం సీరియస్ గా తీసుకోకుండా, వీళ్ళ బిల్లు కూడా తనే చెల్లించాడు.

బయటకు రాగానే "మీరు ఏ పేట వెళ్ళాలి" అని అడిగాడు.

"త్యాగరాయ నగర్"

"రండి, మా కారులో డ్రాప్ చేస్తాను."

"మీకు అనవసరమైన శ్రమ."

'దాని కేముందిలెండి!"

కారు ముందు సీటులో ముగ్గురు కూర్చోవడానికి స్థలంవుంది. కాని అతను వీళ్ళ యిద్దరి కోసమని వెనక సీటు తలుపు తీసేసరికి, వాళ్ళ ఇద్దరి మనస్సు ఒక్కక్షణంచివుక్కుమన్నది. అంతలోనే కారు కదిలింది.

ఈ చిరుకోపం తగ్గేసరికి కారు టీనగర్ వాణీ మహలు చేరింది.

"కుప్పుస్వామి స్ట్రీటు" అని వెనుక సీటులోంచి సావిత్రి కంఠం పలికింది. ఇరవై తొమ్మిదో నెంబరు యింటిదగ్గర కారు ఆగింది.

అమ్మాయిలు ఇద్దరూ దిగారు.

"లోపలకు రండి" అని అతన్ని ఆహ్వానించారు.

అతను గడియారం వంక చూసుకున్నాడు. ఒక్కక్షణం తటపటాయించాడు. "థాంక్స్ ... కానీ మీరు నన్ను ఎక్స్యూజ్ చెయ్యాలి ... నాకొక అర్జెంటు ఎంగేజిమెంటు వుంది. ఈసారి ఎప్పుడైనా వస్తాను. గుడ్ నైట్" అని అన్నాడు.

అమ్మాయిలు ఇద్దరికీ అంతులేని కోపం, అలవి కాని నిరాశ కలిగింది. కాని అంతలోనే తమాయించుకుని "గుడ్ నైట్" అని అన్నారు.

"ఏ మాత్రం మేనర్సు లేవు" అంటూ సీత విసుక్కుంది.

"నిజంగా పని వుందేమో" అంటూ సావిత్రి సర్దిచెప్పబోయింది.

"నువ్వెప్పుడూ యింతే. వూళ్ళో వాళ్ళందరినీ వెనకేసుకుని వస్తావు."

"నువ్వు మాత్రం తక్కువేమిటి? ప్రతి చిన్న విషయానికి నీకు కోపం వస్తుంది."

"మహా శాంతమూర్తివి బయలుదేరావు."

అంటూ సీత విసవిసా నడిచి తమయింటికి వెళ్ళిపోయింది.

సావిత్రి మాత్రం సీతవెళ్ళిన దిక్కే చూస్తూ నిట్టూర్పువిడిచి "పిచ్చిపిల్ల" అని అనుకుంది.

"ఆ కారులో అతను ఎవరే" అంటూ సావిత్రిని వాళ్ళ అమ్మ అడిగింది.

"ఆయన శివరాం గారని గొప్ప సైంటిస్టు. మొన్న సిల్వర్ జూబిలీలో కాలేజీలో ఉపన్యాసం యిచ్చారు. ఇవ్వాళ సినిమాదగ్గర కనిపించి పలకరించారు. ఇటే వెడుతున్నాను గదా. మీ యింటిదగ్గర డ్రాప్ చేస్తామని అన్నారు."

"ఇంట్లోకి రమ్మని పిలవలేదేం ?"

"రమ్మని పిలిచాం, ఏదో అర్జెంటు ఎంగేజిమెంటు వుందని వెళ్ళి పోయారు ఈసారి ఎప్పుడైనా పిలుస్తాను."

వారం గిర్రున తిరిగి వచ్చింది. "సావిత్రీ! సావిత్రీ!" అంటూ సీత వచ్చింది. ఆమె కోపం అప్పుడే పోయింది.

"ఈరోజు హిందూ చూశావా!" అందీ సీత.

"ఏం జరిగింది!" అని అడిగింది సావిత్రి.

పేపరులో చివరి పేజీ చూపించింది సీత. అక్కడ శివరాం ఫొటో వుంది. దానికింద జియాలజీలో ప్రత్యేక శిక్షణ పొందడానికి స్కాలర్‌షిప్ మీద కెనడా వెళుతున్నాడని రాసివుంది.

సావిత్రి ఏం మాట్లాడలేదు. అద్దం వంక చూసి తలదువ్వుకుంటూ ఒక నిట్టూర్పు విడిచింది.

మళ్ళీ ఎన్ని సంవత్సరాలకు కనిపిస్తాడో ... ఒకసారి కలుసుకుని కంగ్రాచులేషన్సు చెప్ప గలిగితే,. తనకు చాతకాదు ... సీతకున్న ధైర్యం తనకు లేదు.

"ఏం అల్లావున్నావేం?" అని సీత అడిగింది.

"ఏం లేదు సీతా ... ఆయనకు కంగ్రాచులేషన్స్ చెబుదామా!"

"నాకేం పని ?"

"ఐతే యీ పేపరు ఎందుకు తీసుకు వచ్చావు!"

"నువ్వు చూసి సంతోషిస్తావని"

"ఏం నీకు మాత్రం సంతోషంగా లేదా ?"

"నాకెందుకు సంతోషం ?"

"మనకు తెలిసిన ఒకవ్యక్తికి ఇటువంటి గౌరవం లభించడం, మనకు సంతోషం కాదా ?"

"ఆయన్ను గురించి నాకేం తెలియదు. తెలుసుకోవాలనే కోరిక కూడా లేదు."

"సరే."

"ఈపూట కాలేజీకి వస్తావా ?"

"ఒకగంట లేట్‌గా వస్తాను"

సీత వెళ్ళిపోయింది. సావిత్రికి ఏం చెయ్యాలో తోచలేదు. ఆయనకు ఫోనుచేసి మాట్లాడితే ? అమ్మో! ఏమనుకుంటాడో ? ఆయనతో తనకేమంత పరిచయముం ఫోనుచేసి మాట్లాడటానికి ? ఆయన్ను చూసింది రెండుసార్లు మాట్లాడింది ఒకేసారి. ఈ స్వల్ప పరిచయం పురస్కరించుకుని ఫోను చేస్తే ఏమనుకొంటాడు ? ఒక పరాయి వ్యక్తిని గురించి తన హృదయం దేనికింత ఆరాట పడుతోంది ? కాని అతను పరాయి వాడంటే మాత్రం తన హృదయం అంగీకరించదు. అతను తనకు ఎంతో ఆత్మీయుడు !

తనవాడు" అని ఎంతగానో

మనస్సు మరీ మరీ చెబుతోంది కాని ఆ తలపు మనస్సులో మసలితేనే తనకు సిగ్గు ముంచెత్తుకొస్తుంది... ఒక్కసారి ఆయన్ను కలుసుకుని కంగ్రాచులేషన్సు చెప్పాలి.

కాలేజీకి బయలుదేరి బస్సు స్టాండు దగ్గరకువచ్చి నిలబడింది. ఆఫీసుల వేళ అయిపోవడంవల్ల బస్సు స్టాండు పలచ పలచగావుంది. పది నిముషాలయింది. బస్సు రాలేదు.

వెడుతున్న ఒక నల్లకారు రోడ్డుమీద సడన్ బ్రేకు వేసుకుని ఆగింది. మరుక్షణం ఒక కంఠం.

"నమస్తే!!" అని పలికింది.

అతను, అతనే సావిత్రికి అంతులేని ఆనందం, విపరీతమైన సిగ్గు ఒకే క్షణంలో కలిగాయి. కళ్ళు మిలమిలా మెరిశాయి. ముఖం ఒక్క క్షణం కెంపు వన్నె కొచ్చింది.

"నమస్తే" అని అతి ప్రయత్నం మీద అనగలిగింది.

"కాలేజీకి వెడుతున్నారా ?"

"ఊ!"

"రండి. మా కారులో డ్రాపు చేస్తాను."

సావిత్రి అక్కడనుంచి కదల్లేదు.

"ఓ ఐయాం సారీ" అని అంటూ అతను కారుదిగి బ్యాక్ డోర్ తెరిచాడు.

"థాంక్యూ వెరీమచ్" అంటూ సావిత్రి కారులోకి ఎక్కింది

"మీ ఫ్రెండు ఏరి?" అని అతను అడిగాడు

"కాలేజికి వెళ్ళింది"

కారు బయలుదేరింది. అతను ఏం మాట్లాడలేదు, రోడ్డు వంకనే చూస్తున్నాడు.

సావిత్రి ఎంతో ధైర్యంకూడ గట్టుకుని,

"ఇవ్వాళ పేపరులో చూశాం.. కంగ్రాచులేషన్సు" అని అన్నది.

"థాంక్యూ"

కారు కాలేజీకి చేరింది. సెకెండ్ అవర్‌కు యింకా పదినిముషాలు వ్యవధి వుంది. కారు దిగబోతూ సావిత్రి "రేపు సాయంకాలం మీరు మాయింటికి టీ కి రావాలి" అని అంది.

"నేనా ?"

"మీరే ! తప్పకుండా రావాలి."

"శనివారం !"

"అవును. పైగా మా అమ్మగారు మిమ్మల్ని చూడాలని చాలా అనుకుంటున్నారు !"

"ఐతే తప్పకుండా వచ్చి వారి దర్శనం చేసుకుంటాను."

"తప్పక రావాలి."

"అల్లాగేనండి ... థాంక్యూ"

సావిత్రి కాలేజీలోకి నడిచే వెళ్ళింది. కాని కాలు నేలమీద నిలవటంలేదు. గాలిలో తేలిపోతున్నట్టు అనిపించింది

"లేడీస్ రూమ్‌కు వెళ్ళగానే సీతా అని పిలిచింది ఇద్దరు సీతలు ఒక్కసారే "హల్లో!" అని అన్నారు

మన సీత మాత్రం దగ్గరకు వచ్చింది

"ఏం?" అన్నట్టు కళ్ళతోనే ప్రశ్నించింది

"ఆయన కనిపించారు నన్ను కారులో డ్రాప్ చేశారిక్కడ రేపు మాయింటికి టీకి రమ్మన్నాను వస్తానన్నారు నువ్వుకూడా రావాలి"

"పానకంలో పుడకని. నేను దేనికి?"

"ఛా, అలా అంటేనే నాకు కోపం నువ్వు లేకుండా నేను ఏ పనీ చెయ్యలేను రానంటే వీల్లేదు ప్లీజ్!"

"చూడు సావిత్రీ నేను ఒక్క మాట చెబుతాను, కోపం వద్దు"

"కోపం దేనికి?"

"శివరాంను నువ్వు లవ్ చేస్తున్నావు"



"సీతా !"

"మెల్లిగా మాట్లాడు !"

"కాదు సీతా ! నువ్వుకూడా వస్తేనే నాకు ఎంతో సంతోషం ఆయన నిన్నుగురించికూడా అడిగారు వస్తావుకదూ ప్లీజ్"

సీత ఏం మాట్లాడలేదు నవ్వివూరుకుంది

ఆరోజు రాత్రి పది దాటింది పుచ్చపువ్వులాంటి వెన్నెల ఆ వెన్నెలలో మేడమీద ఒంటరిగా కూర్చుంది సావిత్రి నిద్రపోదామనే ఆలోచన వచ్చింది కాని కంటికి కునుకు దూరమయింది

రేపటిని గురించి ఆలోచిస్తూ వుంటే యీనాడు నిద్ర రావటం లేదు

"రేపటిరోజు నీ జీవితంలో చిరస్మరణీయమైన దినం" అని మనస్సు వెయ్యిసార్లు పలికింది

రేపు సాయంకాలం ఆయన వస్తారు మా యిల్లు అంతా చూపిస్తాను అమ్మకు ఆయన్ను పరిచయం చేస్తాను మేము తన అంతస్తుకు తగిన వారమని ఆయనకు అనిపిస్తే చాలు మా యింట్లో అందరికీ ఆయన అంటే ఎంతగౌరవమో ఆయన తెలుసుకుంటారు ఆయనకు పార్టీ యిద్దామని చెప్పగానే, అమ్మ ఎంత సంతోషించింది!! ఇంతవరకూ ఆయనతో రెండుసార్లు మాత్రమే మాట్లాడగలిగాను కాని ఆయన ఎంత ఆత్మీయుడుగా కనిపిస్తున్నారు! రేపుతనివితీరా ఆయనతో మాట్లాడవచ్చు! ఎంత మంచివాడు! అంత చదువూ ఐశ్వర్యం వుండికూడా ఎంత నిగర్వంగా వుంటారు!

ఆయన కెనడా వెళ్ళిపోతే అంత కాలం చూడకుండా ఎల్లావుండను? రేపు సాయంకాలం పార్టీ అయిపోయిన తరువాత బీచికివెళ్ళి వెన్నెలలో కూర్చుని సముద్ర తరంగాల వంకచూస్తూ, ఆయనతో ఎన్నో విషయాలు మాట్లాడుతూ యీ ప్రపంచాన్నే మరచిపోవాలి

నా మనస్సుని ఆయన గ్రహించి తన పాదాలచెంత రవ్వంత చోటు యిస్తే చాలు

అనేక యుగాలు గడిచి మరునాటి సాయంకాలం వచ్చింది సరిగ్గా ఆరుగంటలకు ఆ నల్లటికారు సావిత్రి వాళ్ళ యింటిముందు ఆగింది అతను క్రిందకు దిగాడు ఆనందంతో సావిత్రి హృదయం ఉప్పొంగిపోయింది చిరునవ్వు పెదవులమీద చిందులాడింది రెండంగల్లో కారు దగ్గరకు వెళ్ళింది

అతని వంకచూస్తూ "నమస్తే!" అని అన్నది

కారులోంచి ఒక అందమైన అమ్మాయికూడా దిగింది ఆ అమ్మాయికి సావిత్రిని పరిచయం చేస్తూ,

"మిస్ సావిత్రి! మా కాలేజీలో చదువుతున్నారు ఈవిడ నా భార్య! లలితా శివరాం!" అని అన్నాడు

* * *

# నన్ను అర్థం చేసుకోరూ!

సంపత్

"కౌసల్యా సుప్రజారామా..."

అంటూ అతి శ్రావ్యంగా పాప గొంతు పూజ గదిలో నుంచి వినిపిస్తూంటే,

రఘు ఉలిక్కిపడినట్లు నిద్రనుంచి లేచి అప్రయత్నంగానే భగవంతునికి చేతులు జోడించాడు. చక్కని ప్రభాత సమయంలో, స్తోత్రంతో మేలుకొన్న రఘు హృదయం ఏదో తెలియని ఆనందంతో పరవశించింది.

ఎంతో హుషారుగా కాలకృత్యాలు తీర్చుకొని గదిలోకొచ్చిన రఘుకి, అభ్యంగన స్నానంచేసి జారుముడి వేసుకొని తలలో పూజా పుష్పాలతోనూ, నుదుట పూజా కుంకుమతోను, ఒక చేతిలో టిఫిన్ ప్లేటు, మరొక చేతిలో కాఫీకప్పు పట్టుకొని వస్తున్న చెల్లెలు పాపని చూసి దేవతాస్వరూపం కదలివస్తూందా అనిపించింది.

"ఏరా పాపా! మీ వదిన ఇంకా లేవలేదా?" ఆప్యాయంగా అన్నాడు రఘు. ఒక్కతే ఆడపిల్ల అవటం వలన ఇంట్లో అందరికీ పాపని "ఏరా" అని పిలవటం అలవాటు.

"లేదన్నయ్యా, పాపం రెండు రోజుల నుంచి బాగా అలసిపోయిందికదూ. నిద్ర పోతోంది. అందుకనే నేను లేపలేదు. ఏం లేపమంటావా?"

"నీ యిష్టం. నేను లేపమన్నా ఇప్పటి నుంచీ పెత్తనమా అని నువ్వే పోట్లాటకొస్తావు. మీ ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది" నవ్వుతూ అన్నాడు రఘు.

"అయితే అమ్మతో చెబుతాలే వదిన్ని అన్నయ్య పిలుస్తున్నాడు, త్వరగా లేపమని"

"మా పాప బంగారు తల్లి కదూ! అమ్మతో మాత్రం చెప్పకు. అమ్మ వింటే మంచి రోజు చూడకుండా పెళ్ళికొడుకూ పెళ్ళికూతురు మాట్లాడుకోగూడదంటుంది."

"అలాగే అన్నయ్యా, ఆ సంగతి నువ్వు చెప్పాలా" అని పాప నవ్వుకొంటూ క్రిందకెళ్ళింది.

రఘు ఆ సంవత్సరమే ఎమ్. ఎ. ఫస్టుక్లాస్‌లో ప్యాసయి ఆర్ట్సు కాలేజిలో లెక్చరర్‌గా పని చేస్తున్నాడు. తండ్రి పరంధామయ్యగారు క్రిందటి సంవత్సరమే హెడ్‌మాస్టర్‌గా చేసి రిటైర్ అయినారు. కొద్దో గొప్పో పెద్దలు సంపాదించిన ఆస్తి ఉంది గాబట్టి హెడ్‌మాస్టర్‌గా చేసినా జీవితాన్ని ఇంతవరకూ

ఏలోటూ లేకుండా గౌరవంగానే గడుపుకొంటూ వచ్చారు. అన్నపూర్ణమ్మ గారు కూడా పూర్వకాలం నాటి మనిషి భర్తకూ పిల్లలకూ ఇంత వండి పెడుతూ, వారి సుఖదుఃఖాలకు తన జీవితాన్ని అంకితం చేయటం తప్పితే ఇంకేమీ తెలీని అమాయకురాలు.

రఘు పుట్టిన ఎనిమిదేళ్ళకు కాబోలు పాప పుట్టింది. తరువాత పిల్లలే లేరు. పాప అంటే ఇంట్లో అందరికీ చాలా గారాబం. రఘుకి చెల్లెలంటే ప్రాణం. క్రిందటి సంవత్సరమే పరంధామయ్యగారు రిటైర్ అయిన వెంటనే పాపని పి. యు. సి. తో చదువు మాన్పించి వివాహం చేశారు. అతను హైదరాబాదు సెక్రెటేరియేట్‌లో ఏదో పని చేస్తున్నాడు. కుర్రవాడు బుద్ధిమంతుడని, ఏదో దూరపు చుట్టరికమని, పెద్దగా ఆస్తి లేకపోయినా ఇచ్చారు.

రఘు గదిలో పడక్కుర్చీలో పడుకొని ఆలోచిస్తున్నాడు. సరిగ్గా ఇప్పటికి "రాజీ" తన జీవితంలో ప్రవేశించి రెండు రోజులయింది. పెళ్ళికి ముందు తన రాజీ ఇంత అప్సరసలా ఉంటుందని ఎన్నడూ ఊహించలేదు. అబ్బాయి బుద్ధిమంతుడని విన్నాము. "మాకూ ఒక్కతే పిల్ల గాబట్టి తెలిసిన వారని మీ యింట్లో ఇస్తే మాకు తృప్తిగా ఉంటుంది" అని ఈశ్వరరావు గారు కబురు పంపించగానే, నాన్న తన భవిష్యత్తుదృష్ట్యా వెంటనే ఒప్పుకొన్నారు. నాన్న మాటకి తనకి ఎన్నడూ ఎదురు చెప్పటం అలవాటు లేదు. తనూ ఒప్పుకొన్నాడు. కట్నం మీద నాన్నకి తనకికూడా ఎన్నడూ దృష్టి లేదు. కాని నిన్నెవరో అనుకొంటున్నారు, ఏభై వేలట కట్నం.. వినగానే చాలా ఆశ్చర్యమైంది.. అంత డబ్బు ఎవరైనా కట్నంగా ఇవ్వగలరా అని. తాము పాపకిచ్చింది ఎనిమిది వేలు, రెండెకరాలే కదా.

ఏమో అంతకట్నం తెచ్చుకొన్న రాజీ తనని ఎలా ట్రీట్ చేస్తుందీ.. తానెప్పుడూ పుట్టింట ఫ్రిజిడేర్లతోనూ, కార్లతోనూ పెరిగిన మనిషి. కాని మనిషినిచూస్తే అచ్చెలాగానే ఆమె మనస్సు కూడా అతి సున్నితం అనిపిస్తుంది.

ఆలోచిస్తూనే రఘు అప్రయత్నంగా వాచ్ చూసుకొన్నాడు.. అప్పుడే తొమ్మిది గంటలు అయిందే. అనుకొంటూండగానే పక్కనఏదో ఖరీదయిన సెంటువాసన గుప్పుమన్నట్లుంటే తలతిప్పి చూశాడు.. రాజీ వచ్చి కూర్చుంది– కళ్ళకు మిరుమిట్లు గొలుపుతూ, చేతిలో ఏదో పుస్తకం పట్టుకొని.

మొదటి సారిగా ఏమని పలకరించాలా అని అనుకొంటూనే అన్నాడు నవ్వుతూ,

"అమ్మాయిగారికి ఇప్పటికి తీరికయిందన్న మాట"

రాజీ నవ్వి" ఏం? ఇందాకటి నుంచీ మీరిక్కడ వెయిట్ చేస్తు

న్నారా ?" అంది. గొంతుకేమిటో తమాషాగా ఉంది. మనిషంత సున్నితంగా లేదనిపించింది.

పచ్చటి పసిమిచాయతో, విశిష్టమైన అంగ సౌష్ఠవంతో, సౌందర్య దేవతలా వెలిగిపోతూంది ఆమె. విశాలమైన నల్లని కళ్ళు. సుతి మెత్తనగానున్న నాసిక, నున్నని బుగ్గలు, పచ్చని పెదవులు, నల్లని వత్తయిన జుట్టు చూసినకొద్దీ చూడాలనిపించేరూపం అనిపించింది.

కాని ఆ అందం చూసి ఎంత అబ్బురపడినా ఆ అలంకరణ చూసేటప్పటికి ఏమిటో జుగుప్సగా అనిపించింది రఘుకి. నడినెత్తిన పెద్ద సిగ. నుదుటిమీదకు పడేటట్లు కత్తిరించిన జుట్టు, పెద్ద పెద్ద జరీ పువ్వులున్న ఎర్రటి బెనారస్ చీర, అదే రంగు చోళీ, కుడిచేతికి ఒకే ఒక రాళ్ళగాజు, యెడమచేతికి స్క్వేర్ డయల్ వాచీ మెడలో ఎర్ర రాళ్ళ నెక్లెస్, చెవులకు వ్రేలాడుతూ వున్న ఎర్రరాళ్ళ పోగులు ఏమిటోగా అనిపించింది. ఉన్న అందం కూడా ఆ అలంకరణతో కృత్రిమంగా కనిపించ సాగింది.

"మీకు పేంట్సు వేసుకోవటం అలవాటు లేదా ? పంచెలు వాడతారేమిటి అసహ్యంగా. ముసలివాళ్ళ లాగా. అచ్చు పల్లెటూరి వాళ్ళ లాగా వుంటారు."

ఏమిటో అంతచక్కటి వాతావరణంలో ఆ సంభాషణ అతనికంతగా నచ్చలేదు. అయినా నవ్వుతూనే అన్నాడు రాజీతో.

"నాకు గ్లాస్కో పంచె కట్టుకొని, తెల్లని షర్టు వేసుకున్నప్పటి అందం, హుందా, పేంట్ వేసుకొని ఇన్ షర్ట్ చేసుకోవడంలో కన్పించదు రాజీ. అయినా నీకు పేంట్సే యిష్టమయితే తప్పకుండా వేసుకుంటాను." తమాషాగా నవ్వింది రాజీ క్రిందపెదవి విరుస్తూ.

"నా కోసం మార్చుకొంటారా ? అంటే ఇంకొకళ్ళకోసం మీ అలవాట్లను కూడా మార్చుకోగలరా ? విచిత్రంగా వుంది' అంటూ లేచి నుంచొని, 'క్రిందకి వెళ్దాం పదండి, భోజనాలకి టైమయినట్టుంది' అంది.

"నువ్వెళ్ళు రాజీ, నేను వస్తానులే" అన్నాడు రఘు ఎటో చూస్తూ.

* * *

సాయంత్రం లేచేటప్పటికి ఇంట్లో అంతా హడావిడిగా వుంది. పాప పైకొచ్చి చెప్పింది రఘుతో, ఆ రోజు వాళ్ళిద్దరూ (రాజీ, రఘు) రాజీ వాళ్ళఊరు రేపల్లె వెళ్ళాలని, ఆరుగంలకల్లా ప్రయాణమని.

అయిదున్నకే తయారై క్రిందకి వెళ్ళాడు రఘు. అంతా రెడీగా వుంది టాక్సీ అదీ వచ్చి. పాప కార్లో ఏవో పెట్టిస్తూంది. పరంధామయ్యగారు వరండాలో కూర్చొని, ఎవరితోనో మాట్లాడుతున్నారు.

ఎవరో ముసలమ్మగారు అన్నారు. "ఇద్దరూ కలిసి నుంచోండి నాయనా, చూడాలని వుంది.

చెక్కని ఈడూ - జోడూ" రఘూ కదలబోయాడు. కాని రాజీ ఇటు ప్రక్కనైనా చూడకుండా, ఆవిడవంక ఒకసారి నిర్లక్ష్యంగా చూసి, తన ప్రక్కనున్న వాళ్ళ వాళ్ళతో మాట్లాడుతూ కూర్చుంది. రఘు తన ప్రయత్నం మానుకొన్నాడు.

అన్నపూర్ణమ్మగారు లోపలి నుంచి పసుపు కలిపిన గిన్నెతో వచ్చి,

"అమ్మా! రాజీ! చీర కొంచెం పైకితీయమ్మా. పాదాలకి పసుపు రాస్తాను" అన్నారు.

"వద్దండీ. చీర పాడయిపోతుంది, అందులో క్యూటెక్స్ కూడా వేసుకొన్నాను" అంటూ పాదం స్టైల్‌గా ముందుకు జరిపింది అందం చూసుకొంటూ.

సుమంగళత్వానికి చిహ్నంగా భావించే పసుపుని చీర పాడవుతుందని మానివేయటమా - నవ్వొచ్చింది రఘూకి. లోపలకివస్తూ ఈ సంభాషణ విన్న పాప, రఘువైపు చూసి కళ్ళతోనే చెప్పింది నవ్వవద్దన్నట్టు.

అన్నపూర్ణమ్మగారు ఇవేమీ పట్టించుకోకుండా ఏమిటో ఈ కాలపు పిల్లలు అని అమాయకంగా నవ్వుకొంటూ లోపలికివెళ్ళి, వేంకటేశ్వరస్వామి ఫలహారం, మంచినీళ్ళు తీసుకొచ్చి, రాజీచేతికి అందిస్తూ, "మీ యింట్లో నీళ్ళు చల్లగా యుగంలా ఉంటాయంటగామ్మా, పిచి డేర్ ఏదో ఉందంట కదూ" అన్నారు. రాజీ ఫక్కున నవ్వింది, రఘు వంక చూస్తూ. అతని మనస్సు చివుక్కుమంది. అమ్మ అంతటి పవిత్రమూర్తినా హేళనచేయడం. ఆమె ఇంగ్లీషు చదువులు చదవకపోవచ్చు, నేటి నవీన నాగరికత తెలియకపోవచ్చు. అంతమాత్రాన అమ్మవంటి నిర్మలమూర్తిని అపహాస్యం చేయడమా! రాజీ కళ్ళలోకి గంభీరంగా చూసి ఊరుకొన్నాడు రఘు.

పాప అంది "వదినా, హైద్రాబాద్ ఎప్పుడు వస్తారు? మేము ఎల్లుండి వెళ్లిపోతున్నాము."

"మేమూ రేపు రాత్రికిబయలుదేరి హనీమూన్‌కి వెళ్తున్నాం పాపా, వచ్చాక వీలుంటే వస్తాం" అని మీరెక్కడికి వెళ్ళారు హనీ-మూన్‌కి?" అంది.

పాప నవ్వి "మేమెక్కడికీ వెళ్ళలేదు వదినా" అంది. రాజీ ఆశ్చర్యపోయింది 'వెళ్ళలా' అంటూ.

రఘూకి అంతకంటే ఆశ్చర్యంగానే వుంది. ఈ హనీమూన్ ప్రోగ్రామ్ ఏమిటో అతనికంతవరకూ తెలియదు. అయినా సెలవుకూడా ఒక నాలుగు రోజులకంటె ఎక్కువ లేదు.

అతనిలా ఆలోచిస్తుండగానే అన్నపూర్ణమ్మగారు లోపలనుంచి వచ్చి ముహూర్తం దాటిపోతుంది పదండి, పదండి అంటూ కంగారు పెట్టారు.

అందరితోనూ వెళ్ళొస్తాం అని చెప్పి బయలుదేరారు.

కార్లో చెప్పాడు రఘు రాజీతో

తనకు సెలవులేదన్న సంగతి. రాజీ తను ఇదివరకెప్పుడూ తన ఫ్రండ్స్‌ని, పెళ్ళిఅయ్యాక హనీమూన్‌కి వెళ్ళకపోతే, లైఫ్‌ని ఎంజాయ్ చెయ్యటం తెలీని వాళ్ళని, పిసినిగొట్టు వాళ్ళని ఏడిపిస్తుండేదట. ఇప్పుడు తను వెళ్ళకపోతే వాళ్ళు ఏడిపిస్తారని, వెళ్దాం బావా అంటూ గారాబంగా అడిగింది.

రఘు ఏడిపించటానికి అన్నాడు.

"అంటే వాళ్ళకోసం మనకి వీలు లేకపోయినా వెళ్దామా?" రాజీ బుంగమూతి పెట్టింది. తను ఇదివరకన్నమాటని తిప్పి అన్నాడని.

రాజీ అడిగినదానికి కాదనలేక రేపల్లె వెళ్ళినవెంటనే బయలుదేరి వెళ్ళారు. రఘు సెలవు పొడిగించమని కాలేజికి, తమ ప్రయాణంగురించి యింటికి వ్రాశాడు. రఘు దగ్గర పెళ్ళికి వాళ్ళు వీళ్ళు పెట్టింది, జీతం అడ్వాన్స్‌గా తీసుకొన్నది ఏదో కొద్ది మొత్తం వుంది. రాజీ వాళ్ళింటి దగ్గరనుంచి తీసుకువచ్చింది.

హనీమూన్‌లో వున్న పదిహేను రోజుల్లోనూ, రఘుకి, రాజీ తనకెంతో దగ్గరగా వచ్చినట్లు, ఆమె దగ్గరలేకపోతే తాను ఒక్క నిమిషమన్నా బ్రతకగలనా అని అనిపించింది. ఆ మాటే రాజీతో చెప్పాలంటే నవ్వుతుందేమో. రాజీ నవ్వంటే రఘుకెంతో భయం. అదేమిటో తమాషాగా క్రిందపెదవి విరుస్తూ హేళనగా నవ్వినట్లుంటుంది. అది చూస్తే మనసంతా వెలితిగా అయిపోతుంది.

పదిహేను రోజులయిన వెంటనే బయలుదేరి రేపల్లె వచ్చి అక్కడ రాజీని దింపి రఘు ఇంటికి వచ్చేశాడు. వచ్చిన దగ్గరనుంచీ, రోజూ కాలేజికి వెళ్ళి వస్తున్నాడన్న మాటే గాని మనసంతా రాజీ దగ్గరేవుంది. అతను వ్రాసిన నాలుగైదు ఉత్తరాలకి రాజీ దగ్గరనుంచి జవాబు రాలేదు. ఏమయినా ఒంట్లో బాగుండలేదేమో, చూసివద్దాం అనుకొంటూండగానే ఉత్తరం వచ్చింది. వాళ్ళ పిన్నికూతురు వాళ్ళు ఢిల్లీ నుంచి వచ్చారట. వాళ్ళతో హడావిడిగా వుండటం వలన లెటర్ వ్రాయటానికి తీరిక లేదట.

ఆ లెటర్ చూడగానే రఘు మనసంతా ఏదోలా ఐపోయింది. ఎందుకు రాజీ ఇలా ప్రవర్తిస్తూంది? దాంపత్య జీవితం గురించి తానెంత మధురంగా ఊహించుకొన్నాడు. తామిద్దరూ – ఒకరిలో ఒకరు లీనమైపోవాలని, ఊహాకందని తీయని అనురాగబంధమేదో ఇద్దరిమధ్యా అల్లుకుపోవాలని ఎన్నో కలలు కన్నాడే. రాజీ ఎందుకు దగ్గరికి వచ్చినట్లేవచ్చి దూరమయి పోతుం...
తనుకూడా చదు...
భార్యా భర్తల
సున్నితమైన ఆ
తెలియదా?

ఆ తరు...
కాబోలు

...ందుకనో, ఆమెతో వచ్చినవాళ్ళు వెంటనే వెళ్ళిపోయారు. రాజీని చూడగానే రఘు తన మనసులోని బాధనంతా మరిచిపోయాడు. రాత్రి ఎప్పుడవుతుందా, రాజీని ఎప్పుడు దగ్గరికి తీసుకొందామా అని ఎదురు చూస్తూ కుర్చున్నాడు. అన్నపూర్ణమ్మగారు మాత్రం రాజీని ఒక్క నిమిషం కూడా వదిలిపెట్టడం లేదు. అమ్మా, తల్లీ అంటూ— పాప కూడా వుంటే ఎంతో సరదాగా వుండేదనిపించింది రఘూకి. మొన్న వారం రోజులక్రితం పాప ఉత్తరం వ్రాసింది. ఎప్పుడొస్తారన్నయ్యా ఇక్కడికంటూ. వెంటనే వ్రాశాడు రఘు సెప్టెంబరు సెలవులలో తప్పక వస్తామంటూ.

ఆ రాత్రి అన్నపూర్ణమ్మగారు కొడుక్కీ, కోడలికీ కలిపే భోజనం వడ్డించారు. రఘు పైకివెళ్ళేటప్పటికి గది అంతా శోభాయమానంగా అలంకరించి వుంది. పాపం ఎప్పుడూ పైకిరాని అమ్మ ఆ రోజు గది సర్దటం కోసం ఆయాసపడుతూ వచ్చి వుంటుంది, అని నవ్వుకొన్నాడు రఘు.

గది కిటికీవైపుకి కుర్చీలాక్కొని పేపరు తిరగవేస్తూ కూర్చున్నాడు రఘు. కాసేపటికి రాజీ వచ్చింది.
...లను పిరజిమ్మ
ఎక్కడో చదివి
...ంది. 'భార్య
...ర్త తిరిగిచూ
...క్కడ సెంటు
...న రాకమ

తెలియజేస్తూంది. నవ్వొచ్చింది రఘూకి. అమ్మ, పాప కూడా రెండు చేతులకూ నిండుగా గాజులు వేసుకొంటూంటారేమో, తనకి చిన్నప్పటినుంచీ కూడా ఆ గాజుల మృదు మధురమయిన గలగలమనే చప్పుడంటే ఎంతో యిష్టం. అని ఆలోచిస్తూనే, టేబుల్ మీద పాలగ్లాసు పెడుతున్న రాజీ చేతివంక చూశాడు. కుడిచేతికి గాజులే లేవు, ఎడమచేతికి వాచీ పెట్టింది. ఆశ్చర్యంతో దృష్టి పైకి పోనిచ్చాడు. శంఖంలాంటి మెడ నున్నగా మెరిసిపోతూంది. ఎక్కడా మంగళసూత్రం గాని, నల్లపూసలు గాని ఉన్న ఛాయలు కనిపించటం లేదు.

'రాజీ!' అన్నాడు అప్రయత్నంగా

'ఊఁ' అంది మంచం మీద కూర్చొని ఆవులిస్తూ.

"నీ మెడలో మంగళసూత్రం ఎక్కడన్నా పెట్టి మర్చిపోయావా రాజీ."

"లేదండీ చిరాగ్గా ఉందని తీసేశాను. అయినా ఏమిటి, మీకు ఆడవాళ్ళలాగా వస్తువులగొడవ పట్టుకొంది."

రఘు మనస్సు చివుక్కు మనిపించింది. భారతీయస్త్రీ ఎంతో పవిత్రంగా ఎంచుకొనే మంగళ సూత్రం చిరాగ్గా ఉందని తీసేసిందా? ఎంత నిర్లక్ష్యం? ఇదేనా నేటి నాగరికత నేర్పేది? రాజీవంక చూశాడు. నిశ్చింతగా కళ్ళు మూసుకొని పడుకొనుంది.



ఆశ్చర్యపోయాడు రఘు. ఇరవై రోజుల తర్వాత కలుసుకున్నామే, ఒక్క మాటన్నా మాట్లాడకుండా ఎలా నిద్ర పోగలుగుతూంది? తను కావాలనుకొంటే తనదగ్గరకే వస్తానన్న నిర్లక్ష్యమా.

ఆ మర్నాడు లేచేసరికి బాగా పొద్దు పోయింది. ప్రక్కన చూస్తే రాజీనిద్రపోతూంది. గబగబా రాజీని లేపి క్రిందకి వెళ్ళాడు రఘు. పరంధామయ్యగారు యింట్లో లేరు. అన్నపూర్ణమ్మగారు పూజ గదిలో ఉన్నారు. రఘు, రాజీ టిఫిన్ తీసుకొని పైకివచ్చారు. అతను తయారై కాలేజికి వెళ్ళేముందు అంది రాజీ.

"నాన్న చెప్పమన్నారు మీతో, ఛైర్మన్ కోటేశ్వరరావుగారిని కలుసుకొంటే, ఫారిన్ వెళ్ళే విషయంలో ఏదైనా సహాయం చేస్తారట."

"ఎవరి విషయం?" అన్నాడు.

"ఎవరి విషయమో అయితే మీతో ఎందుకు చెప్తాను? మన విషయమే."

"మనం ఫారిన్ వెళ్తున్నామా, అదెప్పుడూ" అన్నాడు రఘు నవ్వుతూ.

"మీకు ప్రతీదీ వేళాకోళంగానే వుంటుంది. పెళ్ళికి ముందే మా నాన్న మీ నాన్నతో చెప్పా[illegible]

ను కొంటూను, మనిద్దరం కలిసి ఫారిన్ వెళ్ళాలని."

"ఇద్దరం కలిసి వెళ్ళటానికి మన మేమీ లక్షాధికార్లం కాదుగా రాజీ," అన్నాడు మెల్లగానే.

"మీరు కాకపోతే కాకపో వచ్చు" అంది రాజీ దురుసుగా.

'రాజీ!' అన్నాడు బాధగా, కొంచెం గట్టిగానే అన్నాడేమో.

"రాజీ! నువ్వు లక్షాధికారి కూతురివే కావచ్చు కాని, నేను ఒక సామాన్యుడినైన లెక్చరర్‌నని తెలిసే వివాహం చేసుకున్నావను కొంటాను. ప్రతి విషయంలోనూ నీకే విధమయినలోటు రాకుండా వుండాలనే ప్రయత్నిస్తున్నాను. కాని నువ్వు నన్ను వీసమంతయినా అర్థం చేసుకోవటం లేదు. రాజీ. నువ్వు ఎన్నిచేసినా సహిస్తానేమో గాని నా అంతస్థును కించపరిస్తే మాత్రం సహించలేను రాజీ" అని క్రిందికి వచ్చేసి కాలేజికి వెళ్ళిపో యాడు.

ఆ రోజంతా క్లాసులో అన్యమన స్కుడుగానే వుండిపోయాడు.

ఆ తరువాత పదిహేను రోజులకు సెప్టెంబరు సెలవులకు పాప దగ్గరకు బయలుదేరారు హైద్రాబాదు. ఈ పదిహేనురోజులు ఒక మాదిరిగా ప్రశాంతంగానే గడిచా యని చెప్పుకోవచ్చు, ఎవరిమనస్సు లోనూ తృప్తి సంతోషాలనేవి లేక పోయినా.

ఆరోజు హైద్రాబాదు చేరేటప్ప టికి లైట్లు వెలిగాయి, పాప వాళ్ళింటికి వెళ్ళేటప్పటికి సాయం త్రం అయిదున్నరయింది. ముచ్చటగా నున్న చిన్న ఇంటిముందు పచ్చ గడ్డిలో పాప, పాపభర్త కూర్చొని నవ్వుకొంటూ కబుర్లు చెప్పుకొంటు న్నారు. పాప జాజిపూల మాల అల్లుతూంది. ఆయన పేపరు చూస్తు న్నాడు. వాళ్ళిద్దరినీ అలా చూడ గానే ధన్యులనిపించింది రఘూ మన స్సుకి. ఇంతవరకూ తమకు ఒక్క సాయంత్రమన్నా యిలా గడిచిందా?

రాజీ ఎందుకనో ముభావంగానే వుంది. రఘూకిఅనిపించింది బహుశా ఫస్ట్‌క్లాస్‌లో తీసుకురాకుండా సెకండ్‌క్లాస్‌లో తీసుకువచ్చినందు కే మోనని.

వెళ్ళగానే స్నానాలు, భోజ నాలు అయ్యాక కబుర్లు చెప్పు కొంటూ కూర్చున్నారు రఘు, పాప భర్త నారాయణ. రాజీ పడుకొంది. పాప ఏదో కూనిరాగం తీసుకొంటూ పనిచూసు కొంటూంది. పాప పాట విని చాలానాళ్ళయింది, మర్నాడు పాడించుకోవాలనుకొన్నాడురఘు.

ఇంతలో "పడకొండు అవుతూంది పడుకొందాం పదండి" అంటూ నారాయణ లోపలికి నడిచాడు.

ఆ రాత్రి అన్నా వదిన లిద్దరికీ పడగ్గది ప్రక్కనున్న హాల్లో ఉన్న వాటిల్లోనే మంచివి రెండు పక్కలు వేసి, తెల్లని దుప్పట్లు పరిచింది. సాంబ్రాణి పుల్లలు వెలిగించి, ఒక చిన్న టీ-పాయ్ మీద పాలు, మంచినీళ్ళు తీసుకొచ్చి పెట్టింది.

రఘు లోపలికి వచ్చేటప్పటికి రాజీ మంచంమీద ఒక ప్రక్కకు తిరిగి పడుకొని ఉంది. నిద్ర పోతూంది, లేవట మెందుకని ప్రక్క మంచంమీద పడుకొన్నాడు.- నిద్ర కుపక్రమిస్తూ. ప్రయాణపు బడలికతో ఉన్నాడేమో వెంటనే నిద్రపట్టింది.

రాజీకెందుకో మధ్యరాత్రిలో మెలకువవచ్చిచూసేటప్పటికి పాపా వాళ్ళు పడుకొన్న పడగ్గదిలో లైట్ వెలుగుతూ కనిపించింది. ఇంతరాత్రి దాకా లైట్ వెలుగుతోందేమిటా అను కొంటూండగానే ఏవో మాటలు వినిపించ సాగినాయి. ఆ మాటల్లో తనపేరు వినిపించేటప్పటికి శ్రద్ధగా ఆలకించ సాగింది:

పాప అంటూంది

"పెళ్ళయిన తర్వాత మొదటి సారిగా వచ్చారు అన్నయ్యా వదిన. ఏదో మనకు తగ్గట్టు బట్టలుపెడితే బాగుంటుందేమో అనిపిస్తుంది. ఏమంటారు?"

కొంచెం ఆగి అన్నాడు నారాయణ

"మనకొచ్చే 200 రూపాయల జీతంతో ఇష్టమొచ్చినట్లు ఖర్చుచేయ డానికి కూడా ఎక్కడుంది సంధ్యా. మనకు వెనకాల పెద్ద ఆస్తులేమీ లేవుగదా. మొన్న రఘు పెళ్ళికి ఏదైనా ప్రెజంటు చేద్దామని తీసు కొన్న అప్పు ఇంకా తీర్చనేలేదు. అయినా వారికి కావలసినవి మన ప్రేమానురాగాలు గాని మనం ఎంతో బాధ పడుతూ ఇచ్చే బహు మతులు కావుగా సంధ్యా. అంతగా నీకు తప్పకుండా పెడదామని వుంటే మాత్రంచెప్పు సంధ్యా! ఎక్క డయినా అప్పు చేసి అయినా తీసుకు వస్తాను."

పాపపేరు సంధ్య అని తన కింతవరకూ తెలియనే తెలియదే అనుకొంది రాజీ.

పాప మెల్లగా అంటుంది

"ఛ ఊరుకోండి. మీరంత బాధ పడతారంటే నే నసలు అడగకనే పోదును. ఏమైనా వీలుంటుందేమో నని అడిగానుకాని, మీకు వ్యతిరే కంగా, మీకు వీలు లేనప్పుడు నేనే పనీ చెయ్యను."

రాజీకి చటుక్కున జ్ఞాపకం వచ్చింది. రఘు ఒకసారి 'ఇద్దరం కలిసి ఫారిన్ వెళ్ళటానికి మనమేమీ లక్షాధికార్లం కాదుగదా' అన్న ప్పుడు తాను దురుసుగా 'మీరు కాకపోతే కాకపోవచ్చు' అనటం రాజీ ఆలోచించసాగింది. పాప ఎలా సహించగలిగింది తన వాళ్ళకు ఏదో పెట్టుకొంటానంటే, వద్దు మనం అంతటి వాళ్ళంకాదని భర్త చెప్తుంటే. తనయితే ఏమాత్రం సరి పెట్టుకోగలిగేది కాదు. అయినా తనకేం పట్టింది సరిపెట్టుకొనేదాకా. తనకి, పాపకి పోలికా? అయినా వీళ్ళు పెట్టే ముష్టి బట్టలు ఎవరికి కావాలి? అనుకొంటూండగానే, పక్క గదిలోనుంచి కిలకిలమంటూ వాళ్ళ నవ్వులు వినిపించసాగినాయి. రాజీకి ఆశ్చర్యమయింది. ఇంతకు

ముందే గధా అలా మాట్లాడు కొన్నారు. అప్పుడే ఇద్దరూ కలిసి హాయిగా ఎలా నవ్వుకోగలుగుతున్నారో.

తన కెప్పుడూ జ్ఞాపకం లేదు, తనూ, రఘు కలిసి ఇంత హాయిగా నవ్వుకోవటం, కబుర్లు చెప్పుకోవటం. ఎప్పుడు చూసినా ఏదో ఒక అందో ళనే సరిపోతూంది తనకు. ఫారిన్ వెళ్ళటానికి అతను సరిగ్గా ప్రయత్నించటం లేదనో, క్లబ్బుకి రోజూ ఎవరో ఒకరి కార్లో వెళ్ళవలసి వస్తూంది, సొంత కారుంటే బాగుండుననో, ఇంట్లో ఫోన్ పెట్టుకొని ఎప్పుడూ ఎవరో ఒకరికి ఫోన్ చేస్తూ దర్జాగా కాలం గడపాలనో ఏదో ఒక గొడవ. ఆయన్ని ఏవడిగినా, మనమంత స్థితిపరులం కానటం మాత్రం చాతనవును. మీదగ్గర లేకపోతే నా కట్నం డబ్బు ఉందిగదా అంటే కట్నం ఇచ్చింది నీకుగాని నాకుకాదు. అయినా అది వాడుకోవటం నా అభిమతం కాదంటూ లెక్చర్లు దంచటం. తన కోరికలన్నీ తీరిస్తే తను మాత్రం నవ్వుతూ సరదాగా కాలంగడపదూ. ఏమిటో ఒక సరదాలేదు పాడులేదు అని ఆలోచించుకొంటూనే నిద్ర పోయింది.

తరువాత రెండు మూడురోజులు సినిమాలతోనూ షికార్లతోనూ సరిపోయింది. చాలా సరదాగా గడిచిపోయింది.

నాలుగో రోజున డాబాలో నలుగురూ బయటకు కుర్చీలు వేసుకొని కూర్చున్నారు. భోజనాలయ్యాక "పాపా! ఏదైనా పాటపాడరా, విని చాలానాళ్ళయింది" అన్నాడు. రఘు.

"మీ చెల్లెలు పాడుతుంటే ఏవో లోకాల్లో తేలిపోతున్నట్లుంటుం దండీ" పాప భర్త నారాయణ నవ్వుతూ అన్నాడు.

"ఛ ఊరుకోండి మీరు మరీను" అంటూ సిగ్గుపడింది పాప.

రాజీకి అనిపించింది, ఎంత ఆప్యాయంగా, నిర్మలంగామాట్లాడుకొంటున్నారో వాళ్ళిద్దరూ అని.

కాని మరుక్షణం ఆమెలో ఉన్న అహంభావం కోడెత్రాచులా పైకొచ్చింది. వీళ్ళదీఒకజీవితమేనా? ఎప్పుడూ ఒకరి చెంత ఒకరుకూర్చొని నవ్వుకొంటూ కబుర్లుచెప్పుకొంటేనే సరిపోయిందా? నలుగురిలోనూ పలుకుబడి హోదా అక్కరలేదా? అవీ ఇవీ చూడాలని, క్లబ్బుల వెడుతూ అక్కడ పెద్దపెద్ద వాళ్లతో పరిచయం సంపాదించుకోవాల! వీళ్ళకి ఉండదా? వీళ్ళ మనస్తత్వ ఎలా ఉంటుందో? పాపని అడిగి ఏమంటుందో? ఆమె ఏమనుకొనా సరే తను అడగాలని నిశ్చయించు కొంది.

కాని ఇంతనుకున్నా ఆమె మనసులో ఎక్కడో మినుకుమినుమంటూనే వుంది. "ఉన్నదాంట్లో సంతృప్తిగా ఒకరిపట్ల ఒక కుండే పవిత్రానురాగంతోజీవితా నందనవనం చేసుకుంటున్నారని."

ఇంతలో పాప ఏదో ఎంకిపాట మొదలుపెట్టింది, తీయని గొంతుతో అందరూ తన్మయులై వింటున్నారు. ఆ పాటలో ఎంకి తన నాయుడు బావకోసం ఎదురుచూస్తూ బావలేక తాను ఒంటరిగా ఉన్నానని, తలచు కొంటే మనసుబరువయిపోతూందని, ఇకనైన ఇల్లు చేరవా అంటూ మధు రాతి మధురంగా పాడుతుంది.

ఆ పాట వినగానే రఘూకి అని పించింది. ఏనాడైనా తన రాజీ తనకోసం ఇలా ఎదురు చూసిందా? అయినా రాజీకి తనమీద మనసులో అనురాగం లేదేమో అనిపించగానే మనసు బాధతో గిలగిలలాడింది.

రాజీ ఆలోచించసాగింది. తన పెళ్ళయి ఇప్పటికి సరిగ్గా మూడు నెలలయింది. ఇంతవరకూ ఒక్క రోజైనా మనస్ఫూర్తిగా సంతో షంగా గడిపింది లేదు. ఏదేదో సాధించాలని, ఎక్కడెక్కడికో ఎగిరి పోవాలని, ఎవరికీ అందని స్వర్గ సీమలో విహరించాలని ఆలోచిం చటం, అవి తీరటంలేదని బాధ తప్పితే, తనతో పోల్చటానికి వీలు లేని వాళ్ళు పొందే సుఖసంతో షాలుకూడా తను పొందలేక పోతూంది. కారణం? తన తెలివి తక్కువతనమా లేక దురదృష్టమా?

ఏమిటి ఇలా వస్తున్నాయి ఆలో చనలు అనుకొంటూ రఘువంక తిరిగి చూసింది. రఘూఎప్పుడు వెళ్ళాడో క్రింద పచ్చగడ్డిలోకి వెళ్ళి వెల్లకిలా పండుకొని ఆకాశంలోకి చూస్తూ పాట వింటున్నాడు,తన్మయత్వంతో. ఎంతచక్కని పర్సనాలిటీ. చూడగానే అనిపించింది. చక్కని చామనిఛాయ రంగులో, సరిపడ ఎత్తుతో, ఎప్పుడూ చిరునవ్వులు చిందించే ముఖంతో చూడగానే సంస్కార వంతుడయిన యువకుడుగా ఆకర్షణీయంగా కనిపిస్తాడు. అందుకే కాలేజిలో అందరూ పడిచస్తారు రఘు అంటే. రాజీకి రఘుని అలా చూస్తూంటే దగ్గరకెళ్ళి కూర్చుని బావా అంటూ అతని గుండెలమీద తల పెట్టుకోవాలనిపించింది.

ఇంతలోనే పాప పాట పూర్తయింది. రఘు ఇంకాఆ తన్మ యత్వంలో నుంచి మేలుకోలేదు. రాజీకేమిటో పిచ్చిగా తనకందరూ దూరమయిపోతున్నట్టూ, అందరూ తనని హేళనగా చూస్తూ కేరింతలు కొడుతున్నట్టూ అనిపించసాగింది. ఏం? పాప తనకంటె ఎందులో ఎక్కువని అంత సుఖంగా నవ్వుతూ ఉంటుంది? రఘూబావతనదగ్గరకివచ్చి తనను ఎందుకు బుజ్జగించరూ?"నీకు నేనున్నానురాజీ. నీకేంకావాలన్నా సమకూరుస్తానని"ఎందుకనరూ? ఛీ, పాడు బ్రతుకు, సుఖంలేని జీవితంలా తయారైంది అనుకొంటూ దుఃఖం ముంచుకురాగా కుర్చీలోంచి లేచి వడివడిగా లోపలికెళ్ళి పోయింది.

పాప, నారాయణ మాట్లాడు కొంటూ కూర్చున్నారు.

కాసేపు కూర్చున్నాక నారా యణ గేటు వైపుకి, పాప లోపలికి

వెళ్ళారు. పాపకెక్కడా రాజీ కని పించలేదు. ఇల్లంతా వెతగ్గా బెడ్ రూమ్‌లో ఫేనూ, లైటున్నా లేకుండా మంచంమీద పడుకొనిఉంది. స్నానం చేయటానికి లేపుదామని లైట్ వేసే టప్పటికి రాజీ దిండులో తలదూర్చి ఏడుస్తూంది.

పాపఆశ్చర్య పోయింది "వదినా! ఏమయింది" ?

గబగబా వెళ్ళి తలుపు వేసి వచ్చి రాజీ పక్కన కూర్చొని బ్రతి మాలుతూంది.

"ఏం జరిగింది వదినా, చెప్పవూ! అన్నయ్య ఏమన్నా అన్నాడా."

ఎంతకీ రాజీ ఏమీ చెప్పక పోవ టంతో లేచి నుంచుని "నువ్వు చెప్పకపోతే అన్నయ్యని పిలుస్తాను" అంది పాప.

వద్దని పాప చెయ్యి పట్టుకొని కూర్చోబెట్టింది రాజీ కళ్ళు తుడుచు కొంటూ.

"అయితే మరిచెప్పు" అంటూ బల వంతం చేసింది పాప.

"ఏం చెప్పమంటావు ? ఏమీ లేదు. మనసంతా ఏమిటో చికాగ్గా ఉంది. నామీద నాకే అసహ్యం వేస్తూంది." అంటూ గబుక్కున మళ్ళా కళ్లనీళ్ళు పెట్టుకోసాగింది అమాయకంగా.

పాప చకితురాలై రాజీని దగ్గరకు తీసుకొని, "ఛ పిచ్చి వదినా! నేను లేనూ నీకు. నీకూ నాకూ కూడా అక్క చెల్లెళ్ళు లేనందుకు మనమిద్ద రం అక్కచెల్లెళ్లులా కలిసిపోవాలి. చెప్పువదినా" అంటూ కళ్ళనీళ్ళు తుడుస్తూంటే రాజీకి ఆశ్చర్యమైంది. ఇంచుమించు తన వయస్సేగదా. ఎంతప్రేమగా పట్నందాగా మాట్లాడు తోంది. ఇన్నాళ్ళూ తను ఎప్పుడైనా పాపతో సరిగ్గా మాట్లాడ గలిగిందీ? ఎందుకనో ఆనిముషంలో పాపంటే ఎనలేని ప్రేమగౌరవాలు కలిగి, తన మనస్సులో అశాంతికి కార ణాలు, పెళ్లయిన దగ్గర్నుంచీ జరిగిన విషయాలు అన్నీ, తనతప్పులుకూడా ఉంచుకోకుండా పూసగుచ్చినట్లు చెప్పి, పాప ఒళ్ళో పడు కొని భోరుమని ఏడ్చేసింది. పాపకి కూడా కళ్లలో నీళ్ళు తిరిగాయి. మెల్లగా రాజీని లేపి కళ్ళుతుడిచి నుదుటిమీద చల్లగా ముద్దుపెట్టు కొని అంది :

"మా వదిన ఉత్త అమాయకు రాలు" అని కొంచెంసేపాగి,

"వదినా! నువ్వు అన్నయ్యని పూర్తిగా అర్థంచేసుకోలేదు వదినా. చిన్నప్పటినుంచీకూడా మేమిద్దరం అన్నా చెల్లెళ్ళకంటె ఎక్కువగా స్నేహితులుగానే పెరిగాము. నేనెప్పుడు భగవంతుడిని ప్రార్థిం చినా, నా గురించి నేనెప్పుడూ కోరుకొనేదాన్నికాదు మా అన్నయ్య మనస్సు అతి సున్నితం. ఏ చిన్న బాధకూ తట్టుకోలేడు. అన్నయ్య నర్థంచేసుకొని అన్నివిధాలా సుఖ పెట్టగలిగే భార్య వచ్చేటట్లు చెయ్యి స్వామీ అని మొక్కుకొనే దాన్ని. అన్నయ్య మనస్సెంత సున్నితమంటే

ఒక పనితో తన భవిష్యత్తు రూపు మారిపోతుందని తెలిసినా, అది మన కోసం చెయ్యమని అడిగిననాడు చెయ్యడానికికూడా వెనుకంజ వెయ్యడు. అలాగే అందరూ తన పట్ల కూడా ప్రవర్తించాలనుకొంటాడు, దానికి ఏమాత్రపు తేడా వచ్చినా తట్టుకోలేడు. అందుకే నేనెపుడూ అంటూండే దాన్ని, ఇంత అతి మంచితనం పనికిరాదన్నయ్యా, జీవితంలో సుఖపడాలంటే కాస్త కఠినంగానే ఉండాలి. నీ మంచితనాన్ని అర్థం చేసుకోకపోగా అలుసు చేస్తారంటే నవ్వి ఊరుకొనేవాడు.

నూరేళ్ళ బ్రతుకుల్ని పవిత్రంగా కలిపి ఉంచేది వివాహబంధం. ఒకరి కోసం ఒకరు అనుకొంటూ గడిపే ఈ జీవితం ఎంత తీయని అనుబంధమో అంత పటిష్ఠమయినది. పెళ్ళి కాకపూర్వం ప్రతివారూ భవిష్యత్తును గురించి ఎన్నెన్నో తియ్యని కలలు కంటుంటారు. అవి నిజమయితే వారికంటె అదృష్టవంతులు మరొకరు ఉండబోరు. కాని అవి తీరని సమయంలో వాటిని తల్చుకొని బాధపడుతూ కూర్చుంటే అది మానసిక పతనానికి, క్రమంగా జీవితంమీద విరక్తికి దారి తీస్తుంది. ఒకరి అలవాట్లను ఒకరికనుకూలంగా మార్చుకొంటూ, అనురాగలతను పెంచుకొంటూ గడిపే జీవితంలో ఉండే తియ్యదనం అనుభవించాలే కాని చెప్పవలసినదికాదు వదినా. అన్నయ్యకి చిన్నప్పటినుంచీ, సింపుల్ గా ఉండటమన్నా, మన అంతస్తుకు, మన



సంప్రదాయాలకు తగ్గట్టు లక్షణంగా అలంకరించుకోవటమన్నా ఎంతో ముచ్చటపడేవాడు. అలా నే నెప్పుడు అలంకరించుకొన్నా 'పాపా! ఎంత బాగున్నావురా' అంటూ మెచ్చుకోనిక్షణం వుండేది గాదు. కాని నీ కాపాత ఆచారాలకుతగ్గట్టు అలంకరించుకోవటంఇష్టం వుండదని నాకు తెలుసు. అయినా అన్నయ్యకోసం అన్నయ్యఇల్లాలుగా నీవు నీ యిష్టాన్ని మార్చుకొని అన్నయ్య కోరినట్లు అలంకరించుకొన్నప్పుడు, అన్నయ్య ముఖంలోని సంతృప్తిని అర్థం చేసుకోగలిగితే నీ మనసు పరవశించిపోతుంది వదినా."

---

అనావృష్టికి
గురియైన
మన దేశ ప్రజలకు
తోడ్పడండి

విరాళాలను
నగదురూపంలో కానీ
వస్తురూపంలో కానీ
ప్రధాన మంత్రి
కరువు సహాయకనిధి
క్యాబినెట్ సెక్రటేరియట్,
రాష్ట్రపతి భవన్,
న్యూ ఢిల్లీ—4 కు పంపండి.

DA 66/ F 1

అంటూ ఎంతో ఆవేశంగా మాట్లాడిన పాప,రాజీ తన చేతులుపట్టుకొని "నాకంతా అగమ్యగోచరంగా ఉంది, నన్ను క్షమించవూ పాపా" అంటూ దుఃఖించడం గుర్తించ లేకపోయింది.

పాప, "లేదు వదినా, నిన్ను నేను క్షమించటమేమిటి? ఆవేశంలో ఏదో మాట్లాడేసి నట్టున్నానుగాని, నీమీద నాకు కోపమేమిటి. లే లేచి స్నానంచెయ్యి. వట్టి అమాయకురాలివి, వదినా నువ్వు. అన్నయ్యకి కూడా నీమీదెప్పటికీ కోపం ఉండదు. కాని నేనెప్పుడూ రఘూ అన్నయ్య చెల్లెలుగా నిన్ను కోరే దొక్కటే వదినా. అన్నయ్య మనస్సు ఎంత చిన్న విషయంలోనైనా సరే పొరపాటునైనా బాధించవద్దు. ఆ అశాంతికి తట్టుకోలేడు. ఎంత బాధఉన్నా మనసులో ఉంచుకొని బాధపడతాడు తప్పితే ఇతరులతో చెప్పుకోలేడు. అనురాగంతో అర్థంచేసుకుని సుఖపెట్టు. జీవితంలో ఎందరో కొందరికి మాత్రమే లభించే అదృష్టం నీ స్వంతం అని తెలుస్తుంది అదృష్టం అనేది కాలగమంలో మన సమీపానికి వచిన్నప్పుడు దాని సౌరభాన్ని ఆఘ్రాణించటం నేర్చుకోవాలిగాని నిర్లక్ష్యంచేస్తే తరువాత విచారించవలసి వస్తుంది' అంటూ రాజీ ముంగురులు సవరించి లైట్ తీసివేసి గది బయటకు వెళ్ళింది, వాళ్ళిద్దరూ ఏం చేస్తున్నారో చూద్దామని.

రాజీ మనసులో ఆలోచనలు సుడి

గుండంలా తిరుగుతున్నాయి.

చెప్పినదాంట్లో ఎంత నిజంఉంది. తన హృదయంలో ఉన్న అహంకారం, దౌర్బల్యమంతా కడిగివేసినట్లు, తన కంటిపొరలన్నీ తొలగిపోయినట్లు అనిపిస్తూంది. ఎదుటనున్న రఘూబావ మంచితనాన్ని గుర్తించేటట్టు చేసింది. తన పూర్వపు ప్రవర్తన గుర్తుతెచ్చుకుంటె తన మీద తనకే జుగుప్స కలుగుతుంది.

ఎప్పుడూ ఫేషన్స్ గురించీ, నలుగురూ చెప్పుకోవాల్సిన గొప్పల గురించి తప్పితే ఏనాడైనా రఘూ బావ గురించి ఆలోచించిందా! ఎప్పుడైనా రఘూ బావ వస్తారు వస్తారంటూ ఎదురు చూసిందా, వచ్చిన వెంటనే ఆప్యాయంగా పలు ఎప్పుడు బావ ఏది చేయమన్నా ఏది అలంకరించుకోమని అడిగినా నిర్మొహమాటంగా తన కిష్టంలేదని చెప్పేదే. ఏ విషయంలో తాను బావని సంతృప్తి పరచినట్లు? బావ మనసుని అంతగా బాధపెట్టిన తనకు ఏ శిక్ష విధించినా పాపంలేదు. ఇంత చదువుకొన్నా పాప చెప్పేదాకా జీవితమంటే ఏమిటో, జీవితపు విలువలేమిటో, జీవితాన్ని స్వర్గం చేసుకోవటం అన్నది తన చేతుల్లోనే ఉన్నదన్న సంగతికూడా తాను గుర్తించలేక పోయింది. ఏమైనా ఈ రాత్రికి బావ సన్నిధిలో క్షమాపణ కోరుకొని తన మనసుని నిర్మలంగ



చేసుకోవాలని నిశ్చయించుకొంది రాజీ.

వెంటనే లేచివెళ్ళి చల్లని నీళ్లతో స్నానంచేసి జరీ చుక్కలున్న తెల్లని చందేరీ చీర, బిగువైన తెల్లని పట్టు బ్లౌజు వేసుకొని,ముచ్చటగా జడఅల్లి విరజాజులు ముడుచుకొంది. రెండు చేతులకూ నిండుగా ఎఱ్ఱటి గాజులు, కాళ్ళకు చిన్నగా మ్రోగే మట్టెలు, మంగళసూత్రం, నల్లపూసలు, ఒక పేటముత్యాలదండ, చెవులకు ముత్యాలదిద్దులు, నుదుటి ని ఎఱ్ఱని కుంకుమతో శోభసంనాటి పెళ్ళికూతురిల్లా, లక్ష్మీదేవిలాగా తయారైంది. తనప్రతిబింబంఅద్దంలో చూసుకొని రాజీ మురిసిపోయింది. ఎన్నో విధాలుగా అలంకరించుకొంది గాని ఇంతటి అందం హుందా ఏ అలంకరణలోనూ తనకి కన్పడలేదు.

ఇంతలో పాప రాజీచేతికి పాల గ్లాసు ఇద్దామని వచ్చి రాజీనిచూసి నివ్వెర బోయింది. చటుక్కున కౌగ లించుకొని ముద్దుపెట్టుకొని అంది.

"మావదిన బంగారుబొమ్మకదూ. ఇవాళఅన్నయ్య నిన్నుచూసి మురిసి పోతాడులే" అంటూ ఏడిపించింది.

రాజీ సిగ్గుగా పాపని విడిపించు కొని పాలగ్లాసు తీసుకొని గదిలోకి వెళ్ళింది. రఘూ మంచంమీద అటు తిరిగి పండుకొని ఉన్నాడు. గాజుల శబ్దం విని, 'పాపా!' అంటూ ఇటు తిరిగిచూసి నిర్ఘాంతపోయాడు. చంద నపు బొమ్మలా వెలిగిపోతూంది తన రాజీ రాజీ తలవంచుకొని, కాలితో నేలను రాస్తూ నుంచొని ఉంది. 'రాజీ!' అన్నాడు రఘూ ఎంతో మధురంగా. చటుక్కునతలెత్తి చూసింది. రాజీ కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి, ఏ నిము షాన బయటకు వస్తాయో అన్నట్టు.

'రా రాజీ' అన్నాడు ఇంకొక సారి రఘూ మంచంమీదనుంచి లేవ బోతూ.

రాజీ చెంగునవెళ్ళి అతని గుండెల మీద వాలిపోయింది. 'నన్ను క్షమిం చరూ' అంటూ.

"ఏమిటి రాజీ ఏమయింది ?" అంటూ ఆమె చుబుకం పట్టుకొని పైకెత్తాడు.

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి మేఘాల్లా.

"మీ మంచితనాన్ని ఇంతవరకూ గుర్తించలేకపోయాను. నన్ను క్షమిం చరూ" అంటూ కళ్ళు దించుకొంది.

"ఛ ! నా పిచ్చిరాజీ ! ఇప్పటి కయినా నన్నర్థం చేసుకొన్నావు అంతేచాలు. ఈరోజే మననిజమయిన తొలిరోజుకదూ" అంటూ దగ్గరకు తీసు కొని, మూసి వున్న కళ్ళను చుంబిం చాడు.

"సరే మనం ఫారిన్ ఎప్పుడు వెళ్దాంరాజీ"? అన్నాడు. పాప, రాజీ వాళ్ళ సంభాషణ విని కొంతవరకూ అర్థం చేసుకొన్న రఘూ రాజీని ఏడి పించటానికి

"ఛ ! ఊరుకోండి" అంటూఅతని కౌగిలిలోకి ఒదిగిపోయింది రాజీ.

[గత సంచిక తరువాయి]




## విహారి & శాలివాహన

## 13

ంకరం నిద్ర లేచేసరికి ఏడైంది. లేచి ఒక్కసారి ఒళ్ళు విరుచు న్నాడు.

లోపల రేణుక వంట ప్రయ ్నంలో వున్నట్లుంది. రాత్రి తనకూ ణూకూ జరిగిన సంభాషణ మన లో మెదిలింది. అతనికి మనసు లచి నట్లైంది.

ముఖం కడుక్కువచ్చి కుర్చీలో ార్చున్న భర్తకు కాఫీ అందించింది ుణుక. అతను ఆమెవైపు చూడనే దు. ముభావంగా కాఫీ త్రాగటం మొదలెట్టాడు.

రేణుక అంది, "త్వరగా స్నానం ాసేండి.ఈలోపల వంటయిపోతుంది. ోజు కొంచెం పెందరాళే ్ళాలి ఆఫీసుకి."

శంకరం మాట్లాడలేదు. కాఫీ ాసు తీసుకుని లోపలికి వెళ్ళి ోయింది రేణుక.

రేణుక మాటల్లో అధికారపూరిత ైన ఆజ్ఞాపన ధ్వనించింది శంక ానికి.

'ఈవిడ ఆజ్ఞను పాలించటానికి నేమైనా కాలేజీ విద్యార్థినా?' అను న్నాడు.

స్నానం ముగించుకుని డ్రెస్ వేసు కు బయలుదేరాడు.

భర్త ఎక్కడికో వెళ్ళటానికి ఉద్యుక్తుడైనాడని కనిపెట్టిన రేణుక అక్కడికివచ్చి "ఎక్కడికి వెళుతు న్నారు" అని ప్రశ్నించింది ఆశ్చ ర్యంగా చూస్తూ.

"కొంచెం పనుంది. బజారు వెళ్ళిరావాలి" శంకరం వీధిలోకి చూస్తూ అన్నాడు.

"ఇప్పుడు మీకు బజారులో పనేమిటో".

భార్యవైపు తీక్షణంగా చూశాడు శంకరం. అతని ముఖంలో కోపం గూడుకట్టుకుంది.

"అంటే నీ వుద్దేశం నేనేమీ పనీపాటూ లేనివాడిననేగా ? నీవు చెప్పినట్లల్లా నడుచుకుంటూ నీ అడు

గులకు మడుగులొత్తుతూ ఇంట్లో పడి వుండమంటావా? నేను నిరుద్యోగినైనా, ఆర్థిక స్వాతంత్ర్యం లేనివాడినైనా వ్యక్తిస్వాతంత్ర్యాన్ని మాత్రం నేను కోల్పోలేను. నా ఇష్టంవచ్చినప్పుడు ఇంటికి వస్తాను, వెళ్తాను''

రేణుక శిలా ప్రతిమలా నిల్చుండి పోయింది. భూమి,ఆకాశం తలక్రిందులైనట్లనిపించిందామెకు. శంకరం పలికిన ఒక్కొక్క మాట ఆమె హృదయాన్ని చితక బాదిచినట్లైంది. భర్త మాటలు కలిగించిన విభ్రాంతినుండి ఆమె తేరుకునే సరికి శంకరం అక్కడ లేడు. కుప్పలా కూలి పోయింది రేణుక.

అసలు రేణుక స్వభావంలో యీ మధ్య కొంత మార్పు వచ్చింది. వివాహం కాక పూర్వం ఆమె మాటల్లో, చేతల్లో ఒకరకమైన పెంకెతనం, ధైర్యం కానవచ్చేవి. ఇంట్లో వాళ్ళుకాని, బయటి వాళ్ళుకాని ఏమైనా మాట్లాడితే, నిర్మొహమాటంగా, బాహాటంగా తన అభిప్రాయాన్ని తెలియ జేసేది. అలాంటిది వివాహమై శంకరంతో ఈవూరు వచ్చేసి వేరింటి కాపరం పెట్టిన తర్వాత, ఆమె అన్నిటికీ సర్దుకు పోయే తత్వాన్ని అలవాటు చేసుకో సాగింది. దీనికి ముఖ్యమైన కారణం— శంకరంతో ఏంమాట్లాడితే అతను నొచ్చుకుంటాడో అనేబాధ. అసలే అతను తన తక్కువ దనానికి బాధపడుతూ ప్రతిక్షణం ఆ 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్'తో తన మనస్సును కష్టపెడుతూవున్నా, దానికితోడు తనేమైనా అంటే మరింత మనస్తాపానికి గురియౌతాడనే సహృదయత ఆమె తనలో పెంపొందించుకుంది.

శంకరం అంత తీవ్రంగా నూ కోపంగాను మాట్లాడగా చూడటం రేణుకకు అదే మొదటిసారి. శంకరం తనను అర్థం చేసుకుంటాడని, తనలో ఏదైనా లోపమున్నా సరిదిద్ది చెప్పి, అవసరమైతే తానే పరిస్థితులకు అనుకూలంగామారి శాంతిని, సుఖాన్ని సృష్టిస్తాడనే ఆశతోవున్న రేణుకకు శంకరంలోని పరివర్తన అవగాహన కాలేదు. ఎందుకలా మారిపోయాడు? అంతగా కోపం వచ్చే మాటలు తానేమన్నది? 'ఆఫీసుకి కొంచెం ముందుగా వెళ్ళాలి, త్వరగా స్నానాదికాలు ముగించుకోమని చెప్పటం తప్పా? ప్రొద్దున్నే బజారులో పనేమిటని అడగటం తప్పా? తను నిరుద్యోగి అనీ, పని లేనివాడనీ, చెప్పినట్లల్లా చేయవలసిన వాడనే అర్థాన్ని స్ఫురించే మాటలు తానేమన్నది గనుక? ఆర్థిక స్వాతంత్ర్యం, వ్యక్తి స్వాతంత్ర్యం లాంటి పెద్ద మాటలు ఎందుకు రావాలి?

రేణుక జీవితంలో తొలిసారిగా ఆ వేదన అనుభవించింది.

హఠాత్తుగా రాత్రి జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది రేణుకకు. ఆర్థిక స్వాతంత్ర్యంలేకపోవటమంటే



ఏమిటో ఇప్పుడు తెలిసిందామెకు. అంత విచారంలోనూ ఆమెకు నవ్వు వచ్చింది.

అడిగిన వస్తువుఇవ్వలేదనిమారాం చేసే చిన్న పిల్లాడిలా కనిపించాడు శంకరం. తన చెల్లికి పంపటానికి డబ్బు యివ్వలేదనే కోపమన్న మాట!

వంద ఏమిటి, రెండు వందలు పంపవచ్చు! కాని, ఎవరికివాళ్ళు

ఉన్నదాంట్లోనే సర్దుబాటు చేసు కోవాలనే ఉద్దేశంతోనేగదా తాను ఇవ్వనంది. ఈరోజు మనదగ్గర వుంది ఇస్తాం, రేపు మరో అవసరంవస్తుంది ఎవరిస్తారు ? ఎవరోవచ్చి ఎన్నాళ్ళని ఆదుకుంటారు ? ఆ యింగితం ఇచ్చే వాళ్ళకీ, పుచ్చుకునే వాళ్ళకీ లేనప్పుడు మధ్యలో తనకెందుకు ?– ఎలా జరగవలసి వుంటే అలా జరుగు తుంది—

భర్త దాగానే వున్న డబ్బంతా ఆయన చేతికి ఇవ్వాలని నిర్ణయించు కుంది రేణుక. అలా నిర్ణయించుకున్న తర్వాత ఆమె మనసు కుదుటపడింది.

## 14

బజారుకని బయలుదేరిన శంక రానికి రాఘవయ్యగారు ఎదురై నారు. రాత్రి ఒకసారి వచ్చి వెళ్ళాడు పాపం ! ఆయనకి డబ్బు అవసరంగా వుందేమో. తన జేబులో వున్న యిరవై రూపాయలూ ఆయనకి ఇవ్వాలనిపించింది. జేబులో చేయి పెట్టాడు.

"బజారుకా బాబూ. పద. నేనూ ఇప్పుడే వస్తాలే కొంచెం అమ్మా యితో మాట్లాడి ..."

అమ్మాయితో ఆయన మాట్లాడే దేమిటో ఎవరికీ తెలియదు. ఇరవై రూపాయల అద్దెకోసమేగా ?– అడి గితే నేనే యిచ్చే వాడిని గా ? ఉద్యోగంలేని చవట వీడేమిస్తాడులే అనుకున్నారు గాబోలు రాఘవయ్యగారు.

అతని అహం దెబ్బతింది.

రాఘవయ్యగారు వెళ్ళిపోయారు.

చెల్లెలికి డబ్బుపంపటం ఎలాగో అర్థంకాలేదు శంకరానికి. పంపక పోతే బాగుంటుందా ?

నోరు తెరిచి అడిగింది... ఉద్యో గం లేకపోయినా భార్య సంపాదన మీద ఆధారపడి వుంటున్నా, తన మాటకు విలువలేకపోలేదని, స్వతం త్రంగా తనూ ఒక వ్యక్తిగా నిలబడ గలననీ చెల్లెలికి తెలిసేలా చేయాలి. అందుకు ఆమె అడిగిన డబ్బును తప్పకుండా పంపితీరాలి. కానీ ఎలా ?

అప్పుడే అటు వెళ్తున్న గణపతి కన్పించాడు. గణపతి మొన్ననే బి.ఏ. పూర్తిచేసేశాడు. డబ్బు గలవాడు, విలాస పురుషుడు. ఈవూరికి వచ్చిన కొద్ది జుల్లోనే తనకు మంచి స్నేహితుడైనాడు. అతగాడిని అడి గితే డబ్బు సర్దకపోతాడా అనిపిం చింది శంకరానికి.

''గణపతీ !'' పిల్చాడు.

గణపతి వెనుతిరిగి చూశాడు. ''హల్లో మిస్టర్ రేణుకా! హౌ డూ యూడూ?'' అన్నాడు, శంకరం భుజంమీద చేయివేస్తూ.

అతని సంబోధనకు క్రుంగిపో యాడు శంకరం. తను మిస్టర్ రేణు కట. అంటే మిసెస్ రేణుకకు భర్త అన్నమాట.

రేణుక భర్తగానే తనకు వ్యక్తిత్వం. శంకరంగా కాదు! తనని ఒకటి రెండుసార్లు మిత్రులకు పరిచయం చేస్తూ 'శంకరం, రేణుక గారి భర్త' అని గణపతి చెప్పటం శంకరానికి గుర్తుకొచ్చింది. అలా పరిచయం చేయటంలోని అంతర్యమేమిటో ఇప్పుడు బోధపడింది శంకరానికి.

తల కొట్టివేసినంతపనైంది అతనికి.

''ఏమిటోయ్, మూగనోముపట్టావేమిటి'' అన్నాడు గణపతి.

శంకరం నవ్వబోయాడు. అంతలోనే 'నోముపట్టటానికి నేనేమైనా ఆడదాన్నా, అనిపించింది.

"రావోయ్ కాఫీ త్రాగుదాం" మళ్ళీ గణపతే మాట్లాడాడు.

శంకరం అనుసరించాడు. అలా మాట్లాడే గణపతిని డబ్బు అప్పు అడగటం బావుంటుందా? ఇంకా చులకనౌతానేమో ననిపించింది. అయినా తప్పదు. గణపతి మినహా తనను ఆదుకునే వాళ్ళెవరూ లేరు.

కాఫీ సిప్ చేస్తూ "నాకేదైనా వుద్యోగం చూసి పెట్టవోయ్." అన్నాడు శంకరం.

గణపతి ఆశ్చర్యంగా చూస్తూ "నీకాఁ వుద్యోగమా? ఏంమాటోయ్ అది? మీయావిడకు ప్లాన్‌లు గీసిపెట్టటంవంటి పార్ట్‌టైం జాబ్‌లు చూడకపోయావ్ పాతికో పరకో యిచ్చునుగా" అన్నాడు.

"గణపతీ!" శంకరం సీరియస్‌గా అన్నాడు.

గణపతి శంకరంలో ఏదో మార్పు వచ్చిందని గమనించాడు. వెంటనే సంభాషణ మారుస్తూ 'ఇ.టీ.వల గుంటూరు జూట్‌మిల్‌కు అప్లై చేశావుగదూ. ఏమైంది?' అన్నాడు.

"ఏమవుతుంది, ఏమీ కాలేదు."

'ఏమిటోనోయ్ శంకరం! ఈ రోజుల్లో ఉద్యోగాలు గగన కుసుమాలైనాయంటే నమ్మ. చిన్న వుద్యోగానికైనా పెద్దరికమెండేషన్ కావాలి. అలాంటిది నీకూ నాకూ ఎవడిస్తాడు వుద్యోగం? అయినా నీకు వుద్యోగం చేసే అవసరమేమిటోయ్?"

అ ప్రశ్నకు జవాబు వెంటనేచెప్పలేకపోయాడు శంకరం. చివరికి "ఉద్యోగంపురుషలక్షణంకదుటోయ్" అన్నాడు నవ్వుతూ.

"భలే చెప్పావ్" గణపతి పగలబడి నవ్వాడు.

"అదిగాక ఎన్నాళ్ళని ఈవిధంగా గడపటం? ఊరికే కూర్చోటం నాకు విసుగెత్తుతోంది. ఆర్జన లేనప్పుడు, ఆర్థిక స్వాతంత్ర్యం ఏం వుంటుంది చెప్పు?'

గణపతి మౌనంగా విన్నాడు. గట్టిగా సిగరెట్ దమ్ములాగి 'డబ్బేమైనా కావాలా" అని అడిగాడు. తానడగకుండానే గణపతి తన అవసరాన్ని గుర్తించినందుకు శంకరానికి ఆశ్చర్యం, ఆనందం రెండూ కలిగాయి.

''నువ్వయినా ఎన్నాళ్ళని ఆదుకుంటావు బ్రదర్'' ఎటో చూస్తూ అన్నాడు శంకరం.

''అఘోరించావ్ లేవోయ్. ఎంత కావాలి. రెండు వందలు చాలా?'' అన్నాడుగణపతి జేబులోనుంచిపర్సు తీస్తూ.

''అబ్బే ఒక్కవంద చాలోయ్'' మొహమాటంగా అన్నాడు శంకరం.

''ఊఁ వుంచు. ఎక్కువకావులే''

శంకరం ఇరవై పదుల్ని లెక్కపెట్టుకుని జేబులో దాచుకున్నాడు. అంతవరకు జటిలంగా కనపడ్డ అతని సమస్య తీరినట్లయింది. మిత్రునికి కృతజ్ఞత తెలుపుకుని ఇంటికి బయలు దేరాడు. అతని వెనుకగా గణపతి నన్నగా నవ్వటం శంకరం గమనించ లేదు.

శంకరం దారిలో పోష్టాఫీసు దగ్గరఆగి, చెల్లెలికి వందరూపాయలు మనియార్డరు పంపి ఇల్లుచేరుకునేసరికి రేణుక ఆఫీసుకి వెళ్ళింది.

డూప్లికేటు చెవితో తాళంతీసి లోపలికి వెళ్ళాడు.

రేణుక భోంచేసినట్లు కనిపించ లేదు. వండినఅన్నంగిన్నె నిండుగానే వుంది. కూర ఏమీ చేసినట్లు లేదు. అన్నం మాడివుంది. వంటకూడా పూర్తి చేయకుండా రేణుక వెళ్ళిపోవటం అతని కోపాన్ని రెచ్చగొట్టింది. కోపాన్నిమించి ఆకలి ప్రజ్వరిల్లుతోంది. తను ఎలాగూ ఇంట్లోనే వుంటాడుగాబట్టి, చేసేపని ఏమీ వుండదుగాబట్టి, కూర చేసుకోలేడా అనుకుంది గాబోలు. ఇదివరకు ఒకటి రెండుసార్లు ఉదయాన్నే ఏదో పనిమీద రేణుక వెళ్ళవలసి వచ్చినప్పుడు తనే అన్నం వండి కూర చేశాడు. అలాగే ఇవాళ కూడా చేసుకుంటాడు లెమ్మనుకుందేమో ?

శంకరం చివాలున లేచాడు. హొటలుకు వెళ్ళి భోంచేద్దామనుకున్నాడు. బయలుదేరాడు.

రేణుక యింటికొచ్చేసరికి రాత్రి ఎనిమిది గంటలైంది. వరండాలో ఈజీఛైర్లో పడుకుని ఏదో పుస్తకం చదువుతున్నాడు శంకరం. రేణుక రాక గమనించనట్లే కూర్చున్నాడు. రేణుక లోపలికెళ్ళింది.

ప్రొద్దున తను వండిన అన్నపు గిన్నె అలాగే వుంది. తనలాగే భర్త కూడా ఇంట్లో భోంచేయలేదని హొటలులో భోంచేసి వుంటాడని అనుకుంది. త్వరత్వరగా స్నానం చేసివంటచేసింది. "భోంచేద్దాంరండి" అని పిలిచింది భర్తనుద్దేశించి.

"నా కక్కరలేదు" శంకరం సమాధానం.

"ఎందుకని ?"

"ఆకలి లేదు."

భర్త రాత్రి జరిగిన సంఘటనను ఇంకా మనసులోనే వుంచుకుని ఆకలి లేదంటూ అన్నం మానటం,

మాట్లాడక పోవటం రేణుకకు నచ్చ లేదు ఈ విధంగా ఎన్నాళ్ళని తనను సాధించడం. చివరికి తాను సాధించేదేమిటి ? ఆమెకు కోపం, దుఃఖం ఒక్కసారిగా ముంచుకొచ్చాయి.

"మీకు ఆకలి ఎందుకుకాదో నాకు తెలుసు" అంది దుఃఖాన్నాపుకుంటూ.

"నీకు తెలిసినా తెలియక పోయినా నాకు ఒరిగేదేమీ లేదు".

రేణుక విసవిసా లోపలికి నడిచింది. పెట్టెతెరచి డబ్బు వున్న పర్సును తెచ్చి "ఇదిగో"అంది.

శంకరం తలయెత్తాడు. రేణుక చేతిలోని పర్సును చూశాడు.

"ఎందుకు?"

"ఇందుకేగా మీ కోపమంతా. తీసుకోండి. నాక్కావలసివచ్చి నప్పుడు మీరే యిద్దురుగాని."

"నాకేమీ అక్కరలేదు! నీవు సంపాదించుకున్నడబ్బు నా కివ్వడ మెందుకు ?"

తా నిన్నాళ్ళూ ఖర్చు పెడ్తున్న డబ్బు ఎక్కడిదో ? ఈ అభిమానం ఇన్నాళ్ళూ ఏమైందిక ఆ మాట అడిగితే జవాబు చెప్పగలడా ? పెదవులదాకా వచ్చింది. అయినా అన లేకపోయింది "ఎందుకు నన్నిలా వేధిస్తారు?" అంది.

"నిన్ను నేనేం వేధించటంలేదు ఉద్యోగంచేస్తున్నావు సంపాదించు కుంటున్నావు ఖర్చుపెట్టుకుంటున్నావు. ఇష్టం వచ్చినట్లు తిరుగతున్నావు. నీమీద అధికారం చెలయించటానికి నేనెవర్ని ? అర్జనలే: అసమర్థుడిని'

'ఎవరన్నా రామాట !'

'వేరే అనాలా ? ఛీ ... ఛీ నిన్నని లాభమేమిటి ? నా కంటి: నేనే పొడుచుకున్నాను. నిన్ను పెళ్ళి చేసుకోవటంలో ఎంత పొ పాటు చేశానో ఇప్పుడు తెలి: వస్తోంది.'

భర్తమాటలు అమితంగా బాధిచాయామెను. అవమానంతో క్రుంగి పోయింది. ఆ మాట కేస్త్రీ బా పడదు ? ఆమెలోని అభిమానందెబ్బ తిన్న పాములా పడగ విప్పింది.

'అది నేననవలసినమాట' అనే గిరుక్కున తిరిగి లోపలి కెళ్ళింది.

రేణుక అలా అంటుందని వూహించని శంకరం విస్తుపోయాడు అమాట నిజమే. చక్కని హోదా గల వుద్యోగంచేసుకుంటూ తనకం చదువులోనూ, సంపదలోనూ తక్కువైన నిరుద్యోగిని పెళ్ళిచేసుకోటానికి ఏ స్త్రీ యిష్టపడుతుంది ? కాని రేణుక తనను పెళ్ళి చేసుకోటానికి సందేహించనేలేదు. ఎందువల్ల ?

తను సందేహించిమాత్రం ఏం చేయగలిగాడు ? మరి యిప్పుడిలాంటి కలతలువస్తే ఆశ్చర్యపడటం తెలివితక్కువే ? తెలిసో తెలియకో ఒకతప్పు చేసినప్పుడు గతాన్ని తలుచుకుని చింతిస్తూ కూర్చునే

కం,టే పరిస్థితులతో రాజీపడటం సబబేమో ? ఈ వాతావరణంమారి, మళ్ళీ పరిస్థితులు చక్కబడాలంటే తనకొకటే మార్గం కనిపిస్తోంది .

అలా ఆలోచిస్తూనే నిద్రపోయాడు శంకరం

ఆ మర్నాడు తెల్లవారుతూనే శంకరం ప్రయాణమైనాడు. ఎక్కడికి వెళుతున్నదీ, మళ్ళీ ఎప్పుడు వచ్చేదీ ఏమీ చెప్పలేదు రేణుకకు. అసలు ఎందుకు వెళ్తున్నదీ తెలియదామెకు ఆమె అడగనూలేదు హేండుబాగ్ లో తన బట్టలన్నిటిని సర్దుకుని రిక్షాను పిల్చాడు

రేణుక ఇక వుండబట్టలేక పోయింది. ప్రయాణమై వెళ్ళే వాళ్ళని ఎక్కడికి అని అడగకూడదంటారు. ఒకవేళ తనమీద కోపంతోనే ఎక్కడికైనా వెళ్తున్నారేమోననిపించింది

"ప్రయాణ మెందాకా ?"

"నీ కనవసరం విసురుగా సమాధానం చెప్పాడు శంకరం.

రిక్షా కదిలిపోతుంటే చూపు అందిన వరకూ చూస్తూనే నిల్చుంది రేణుక. అకారణంగా భర్తకు తన మీద కోపం రావటం, అనుకోని పరిణామాలు ఒకదాని తర్వాత మరొకటి ఇలా సంభవించటం ఆమెకు ఆశ్చర్యాన్ని, దుఃఖాన్ని కలిగించినాయి. ఒకవేళ గుడివాడలో తన చెల్లెలి దగ్గిరకేమైనా వెళ్తాడా, లేక మరెక్కడికైనా వెళ్తాడా ? ఎప్పుడు వస్తాడు ? ఈ వియోగం శాశ్వతం కాదుగదా ?—

"ఏవిటీ కుశంకలూ, సందేహాలూ— పిచ్చిపిల్ల !" రేణుక మనసు హెచ్చరించింది.

# 15

"ఇన్నాళ్ళకి మాలతి కోరిక నెరవేరింది మనల్నివదలి వెళ్ళిపోతున్నందుకు బాధగావున్నా, తన తల్లిదండ్రుల దగ్గరికి వెళ్తున్నందుకు ఆనందంగా వుంది ఏం మాలతీ, మమ్మల్ని మరచిపోవు గదూ ?" రఘు మాలతిని చూస్తూ అడిగాడు.

"మీఒక్కళ్ళనీ మరచిపోతాను" అంది మాలతి నవ్వుతూ.

"అమ్మాయి స్నేహంతో నీకు కొంచెం నలుగురిలో మాట్లాడే ధైర్యం వచ్చిందే మాలతీ" అంది సౌభాగ్యమ్మ

రఘు, లక్ష్మి, మాలతి నవ్వేరు

"భలేవారండి పిన్నిగారూ సహవాస దోషం రేణు వుండగా కొంత బట్టికపోయినా, అది వెళ్ళిన తర్వాత అబ్బింది ఇప్పుడు ఫర్వాలేదులెండి!" అంది మాలతి

సౌభాగ్యమ్మకు రేణుక గుర్తుకు వచ్చింది ఆమె ముఖంమీద విచార రేఖలు లీలగా కదిలాయి

"ఏంవిటోనమ్మా. అది మేమెన్ని

చెప్పినా వూరుకోనివ్వాళ్ళో ఏ అవస్థలు పడుతోందో ? వెళ్ళి రెండు నెలలైనా వ్రాసింది ఒక్కవుత్తరం."

"ఉత్తరాల సంగతలా వుంచు రేణుక తనకొచ్చే జీతంతో ఎలా గడుపుకొస్తోందా అని నా కాశ్చర్యంగా వుంది కార్లలో తిరుగుతూ కాలాన్ని సరదాగా గడిపేది ఇప్పుడు సంసార భారంతో ఏం సతమత మవుతోందో అర్థంకావటంలేదు" రఘు విచారంగా అన్నాడు

"వదిన పద్ధతులన్నీ అంతే పరిస్థితులకీ, పరిసరాలకీ అనుగుణంగా మసలుకోవటం ఆవిడకు బాగా తెలుసు " లక్ష్మి అంది

"ఏమైనా రేణుక చేసింది మంచి పని కాదనే అనిపిస్తూ వుంటుంది నాకు" అంది మాలతి.

"ఏమిటది ?" సౌభాగ్యమ్మ అడిగింది.

ఒక్క క్షణం తటపటాయించి చెప్పింది మాలతి "అదే ఆ శంకరం గారిని వివాహ మాడటం !"

రఘు ఆవేశంగా అరిచాడు "మాలతీ ఆ మాటని మాత్రం మళ్ళీ అనకు రేణుక మనస్ఫూర్తిగా శంకరాన్ని ప్రేమించి వివాహం చేసుకుంది "

"అవునే మాలతీ అమ్మాయికి మొహమాటు మేయూ లేదు. దానికి



యిష్టం లేకుంటే నిర్భయంగా చెప్పే సేది" సౌభాగ్యమ్మ అన్నది.

"అది నిజమేనండీ .. అదిఆయన గార్నెంతగా ప్రేమించినా, అలాంటి దాంపత్యంలో పొరపులు రాకుండా వుండవనే నేననేది జనరల్ గా అన్నానేగాని, రేణు ఏదో బాధపడు తోందని గాదు నేచెప్పేది".

విషయం మారుస్తూ అడిగింది లక్ష్మి "ఇంతకీ నీ ప్రయాణంఎప్పుడు మాలతీ"

"రేపు రాత్రికి బయలుదేరుతాను రేణూకి కూడా ఇవాళే లెటర్ వ్రాశాను"

"అయితే నీకూ యిక యీ స్వయంపాకం, నడక తప్పిపోతా యన్న మాట మీ నాన్న గారికి కారున్నదన్నావు గదూ" రఘు అడి గేడు, నవ్వుతూ

"ఆ ఎంత మీ అంత గొప్ప వాళ్ళం కాకపోయినా మా నాన్న సీ టీ వో" అంది మాలతి

అంతా నవ్వుకున్నారు. సౌభా గ్యమ్మ అంది,

"త్వరలో పెళ్ళిభోజనాలకిఆహ్వా నించవేపిల్లా! అలాగన్నా మీ గుంటూరు చూసొస్తాను."

"పోండి పిన్నిగారూ" అని సిగ్గు పడింది మాలతి

మరికొంత సేపటికి అందరిదగ్గరా సెలవు తీసుకుని వెళ్ళిపోయింది మాలతి

# 16

శంకరం గుంటూరు చేరాడు.

చిన్ననాటి స్నేహితు డొకడు అక్కడ వొక కాలేజీలో క్లార్కుగా వుద్యోగం చేస్తున్నాడు. అతని గదిలో దిగేడు. మొట్టమొదటగా అక్కడి జూట్ మిల్ లో వుద్యోగాల విషయం విచారించాడు. ఇప్పుడేమీ ఖాళీలు లేవని, ఒకటి రెండు నెల ల్లో ఖాళీలు రావచ్చనీ చెప్పారు.

అప్పటివరకూ అక్కడే వుందా మనుకొన్నాడు శంకరం. తను బి ఎ, ఎం ఎ చదవకపోవచ్చు. కానీ, నిరక్షరకుక్షి కాదుగదా ? ఎలా గైనాసరే, ఏదో ఒక వుద్యోగాన్ని సంపాదించాలనీ, ఒకరిమీద ఆధార పడకుండా జీవితాన్ని గడుపుకొనే ఆధరువును వెతుక్కోవాలనీ, అప్పటి వరకూ యింటికి వెళ్ళకూడదనీ తీర్మానించుకున్నాడు. ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజిలో పేరును నమోదు చేయించాడు. తన వ్యాపార అనుభవాన్ని, తెలిసిన మెళకువల్ని, ప్రత్యేకించి మిల్లు అధికారులకు స్వయానా చెప్పుకు న్నాడు.

అతని శ్రమ వృథాపోలేదు. అధి కారులు శంకరం చెప్పినవన్నీ ఆల కించి ఖాళీరాగానే వుద్యోగం యిస్తామని వాగ్దానం చేశారు.

అప్పటి వరకూ జరగటమెలా

గన్నదే యిప్పుడు సమస్య అయింది రెండు మూడు దుకాణాలలో పద్దులు వ్రాయటానికి ఒప్పుకున్నాడు. ప్రొద్దుటపూట రెండు ట్యూషన్లు ఏర్పరచుకొన్నాడు. తన ఒక్కడికి అయ్యే ఖర్చుకు సరిపడ ఆదాయం చేతికందవచ్చు.

ఒక నెల గడిచింది.

ఆరోజు సాయంత్రం కొట్లో కూర్చుని పద్దులు వ్రాసుకుంటూ వున్నాడు శంకరం. ఇంతలో ఎవరిదో పరిచయమైన గొంతు వినిపించింది – కౌంటర్ దగ్గర. షిఫాన్ చీరెలు పది రకాలు చూపించ మంటోంది ఆ యువతి. ఆవిడకు చీరెలు చూపించటానికి గుమాస్తాలంతా వినయంగా అటూ యిటూ మసలుతూ కొట్లో వున్న నాణ్యమైన చీరెల్ని ఆమె ముందు పడేస్తున్నారు. షావుకారు గారు స్వయంగా ఆవిడవద్దకు వెళ్ళి నిల్చుని గుమాస్తాల మీద అజమాయిషీ చేస్తున్నాడు.

శంకరం తలెత్తి ఆ వైపు చూశాడు.

మాలతి!

మాలతిని చూసి ముఖం తప్పించాలనే వుద్దేశంతో వంగి పుస్తకంలో తలదూర్చేడు శంకరం.

ఇదంతా గమనించింది మాలతి.

"శంకరం గారూ!" మాలతి పిలిచింది ఉత్సాహంగా.

శంకరం యివతలకు రాక తప్పలేదు

"ఇక్కడున్నారేమిటి?"

జవాబు ఏం చెప్పాలో తోచలేదు శంకరానికి.

"మీరిక్కడికి ఎప్పుడు వచ్చారు?" ఎదురు ప్రశ్న వేశాడు.

"నాకీవూరు ట్రాన్స్‌ఫర్ అయింది. వచ్చి నెలరోజులు కావస్తోంది. మీరిక్కడేం చేస్తున్నారు?"

"అదంతా తర్వాత చెప్తాను మీ అడ్రసివ్వండి. మీ యింటికి వచ్చి అన్ని విషయాలూ మాట్లాడతాను" అన్నాడు.

మాలతి అర్థం కానట్లుగా చూస్తూ అతనికి అడ్రసు యిచ్చి వెళ్లిపోయింది. "తప్పకుండా రండి రేపు" అని చెప్తూ.

శంకరం మాలతితో మాట్లాడుతున్నంతసేపూ షావుకారూ, గుమాస్తాలూ గ్రుడ్లప్పగించి చూస్తూ వుండిపోయారు.

"అమ్మాయి గారు మీకెలా తెలుసు?"— షావుకారు మొదటిసారిగా గౌరవవచన ప్రయోగం చేశాడు.

"కొంచెం పరిచయముందిలెండి" తేల్చిగా అనేశాడు శంకరం.

శంకరానికి ఆ తర్వాత తెలిసింది మాలతి తండ్రి సీ. టీ. వో. అని.

## 17

రేణుకకు దిగులూ భయిమూ ఎక్కు వైనాయి. భర్త ఎక్కడికి వెళ్లిందీ అంతు తెలియలేదు. ఇక రాడేమో ననే భయం కలుగుతోంది. ఏమిటీ పరీక్ష తనకు? ఎందుకీ శిక్ష? తనేం తప్పు చేసింది?— ఇప్పుడు తనేం చేయాలి? ఎవరైనా సలహా చెప్పే వాళ్ళుంటే బాగుండు ననిపించింది.

ఎవరున్నారు?—

ఎవరి నడుగుతుంది?—

ఏం సలహా అడగగలదు?—

ఇప్పటికే కొంతమంది అనుమానిస్తున్నారు, భర్త దేశంమీద పోయాడని సన్నిహితులైన స్నేహితులడిగినప్పుడు మాత్రం తా నేదో సర్ది చెప్తోంది అయినా వాళ్ళు చేసే ఊహాగానాలు వాళ్ళు చేస్తూ నే వున్నారు.

భయాందోళనలతో కొట్టుమిట్టాడుతూ కర్తవ్యం తెలియక కలవర పడుతున్న సమయంలో మాలతి వ్రాసిన వుత్తరం రేణుకకు ధైర్యాన్ని కలిగించింది.

"రేణూ,

నీకు వుత్తరం వ్రాద్దామని ఎన్నో రోజులనుంచీ అనుకుంటున్నాను, కానీ వ్రాయలేక పోయాను.

ముఖ్యమైన సంగతీ, నీకు సంబంధించినదీ తెలియజేయాలని ఈ జాబు వ్రాస్తున్నాను.

మీవారు నాకీవూళ్ళో ఒక బట్టల కొట్లో తారసపడ్డారు. "ఇక్కడికి ఎప్పుడు వచ్చారు? ఏం చేస్తున్నారు?" అని ప్రశ్నించాను. సమాధానం చెప్పకుండా తప్పించుకుని, యింటికి వస్తానని అడ్రస్ తీసుకున్నారు. అంతే అంతులేరు!

ఆ తర్వాత విచారిస్తే ఆ బట్టల కొట్లో వారు గుమాస్తాగా వుంటున్నట్లు తెలిసింది. నేను కనిపించిన మర్నాడు ఆ కొట్లో కొలువు మానేశారట. ఎక్కడుంటున్నదీ తెలియదు. తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాను.

రేణూ, ఇదంతా నాకేమీ అర్థం కావటం లేదు. అంతా మిస్టరీగా కనపడుతోంది. ఏం జరిగింది? కలతలు రేగాయా, స్పర్ధలు కలిగాయా? ఆయన యీ ముష్టి వుద్యోగాల కోసం ఎందుకు నిన్ను వదలి వచ్చేసినట్లు? ఆయనకు కలిగిన కష్టమేమిటి?

నా ప్రశ్నలకు సరియైన, నిజమైన సమాధానాలు చెప్పకపోయావో మన స్నేహ భాండం బ్రద్దలవుతుంది.

వెంటనే జవాబు వ్రాయి.

... నీ, మాలతి.

రేణుకకు ఏడుపొచ్చినంత పనైంది. భర్తమీద కోపం వచ్చింది. ఎక్కడో వూరుకాని వూళ్ళో ఎవరో షావుకారువద్ద పద్దులు వ్రాసుకోవలసిన దుర్గతి తన కెందుకు? వలు



గురిలో ఎంత అవమానం? మాలతికి జవాబేమని వ్రాయటం?—పోనీ,

తను వెళ్లి భర్తను బ్రతిమిలాడి కాళ్లావేళ్లాపడి ఒప్పించి ఇంటికి తీసుకువస్తే...

లాభంలేదు. తన ప్రయత్నం ఫలించదు. అభిమానం అడ్డువచ్చి ఇంకా తనను నిందించవచ్చు. ఆ అభిమానంతోనేగదా అసలు తనను విడిచి వెళ్ళింది!



చాలాసేపు ఆలోచించిన మీదట రేణుకకు ఒక ఆలోచన తోచింది. కారుమేఘాల్ని చీల్చుకొచ్చే మెరపు తీవలా పెదవులమీద చిరునవ్వు తళుక్కుమంది.

లెటర్‌ప్యాడ్ తీసి, కలం తెరి చింది. లెటర్ వ్రాసేసింది

వ్రాసిన ఉత్తరాన్ని మరోసారి చదువుకుని, సంతృప్తిగా నిట్టూర్చి, కవరులోపెట్టి ప్రక్కకు తిరిగిన రేణుకకు, వేణుమాధవ్ రాక అమితమైన ఆశ్చర్యాన్ని కలిగించింది.

'రండి, రండి. ఏంవిటిలా అనుకోకుండా వచ్చేశారు.' అంటూ వేణుమాధవ్‌ని ఆహ్వానించింది.

వేణుమాధవ్ నవ్వుముఖంతో లోపలికి వచ్చి కూర్చున్నాడు "అర్జెంట్‌గా ఛీఫ్ యింజనీర్‌తో మాట్లాడవలసిన పనుండి వచ్చాను. ఆఫీస్‌లో విచారిస్తే మీరీవేళ సెలవని చెప్పారు.'

'అవునండీ' అని తెచ్చికోలు సంతోషంతో నవ్వటానికి ప్రయత్నించింది రేణుక.

వేణుమాధవ్ ఆశ్చర్యపోయాడు సెలయేటి జాలులా, లేడి పిల్లలా వుండి, తనునవ్వి నలుగుర్ని నవ్వించే రేణుకలో ఏదో మార్పు కొట్టవచ్చినట్లు గోచరించిందతనికి— ఆమెను చూసే సరికి.

మనస్సులోమాటని బయటికే

అనేశాడు. "ఏఁవిటి మీ రదో లా వున్నారు ?"

రేణుక మళ్ళీ నవ్వటానికి ప్రయత్నించి విఫలురాలైంది. "ఏఁవీలేదండీ. వంట్లో బాగా లేదీ వేళ" అంది.

వేణుమాధవ్ ఒక్క క్షణం ఆగి యిల్లంతా కలయజూసి అడిగేడు, "శంకరంగారేరీ?"

రేణుక ఆశించిన ప్రశ్నే కావటం వలన వెంటనే సమాధానం చెప్పింది, "వాళ్ళ . చెల్లెలుగారింటికి వెళ్ళారు. రేపుగానీ రారు." అని విషయం మారుస్తూ అడిగింది, "ఏఁవిటండీ విశేషాలు ? మన ఆఫీసులో అంతా బాగున్నారా ? కాళిదాసుగారే మంటున్నారు ? అన్నట్లు మాలతి గుంటూరు వచ్చేసిందిట. తన ట్రాన్స్‌ఫర్‌కు మీరు చాలా హెల్ప్ చేసినట్లు ఎంతో వ్రాసింది. మీరంటే అందరికీ ఎంతో గౌరవం, అభిమానం."

భర్త విషయం అడిగితే ఆ విషయాన్ని దాటేస్తున్న రేణుకను గురించి ఆలోచిస్తున్న వేణుమాధవ్, "అఁ నాదేముందండీ? నాచేతనైన సాయం చేయగలవాణ్ణి మాత్రమే నేను. మీ ట్రాన్స్‌ఫర్ ఆపించ గలిగానా ? అన్నాడు.

కొద్దిక్షణాలు నిశ్శబ్దంలో గడచిపోయినై. రేణుక లేచి ఫ్లాస్క్‌లో కాఫీ గ్లాసులో పోసి తెచ్చి అతనికిచ్చింది.

వేణుమాధవ్ కాఫీ సిప్ చేస్తూ అన్నాడు, "మా కాంతానికి ఆపరేషన్ చేయించాలని ఆలోచిస్తున్నాను."

"అలాగా" అంది రేణుక.

రేణుక అంత నిబ్బరంగా "అలాగా" అనటంతో వేణుమాధవ్ ఆశ్చర్యపోయాడు. రేణుక ప్రవర్తనలో గొప్ప మార్పు కలిగిందని రుజువైందతనికి. కాంతాన్ని గురించి ఏ విషయం మాట్లాడినా, అతని జాలి గాథను చెప్పినా, ఎంతో వుత్సాహాన్ని ప్రకటిస్తూ, అతని యెడల జాలిగా, సానుభూతితో విచారాన్ని వ్యక్తం చేసే రేణుక యిలా అంటీ అంటనట్లు మాట్లాడటం — వేణుమాధవ్‌లో ఆలోచనల్ని రేపింది.

రేణుక ఏదో హృదయావేదనని అనుభవిస్తున్నట్లు తెలుసుకో గలిగాడు. ఏఁవిటది ?

రేణుక చెప్పదని సందేహిస్తూనే అడిగాడు, "మీరు మరేమీ అనుకోనంటే మిత్రుడిగా ఒక్కమాటడుగుతాను నిజం చెప్తారా ?"

రేణుక విస్తుపోయింది. "అదగండి" అంది నెమ్మదిగా.

"శంకరంగారు ఎక్కడికి వెళ్లారు? నిజం చెప్పండి. ఆఫీసులో ఎవరో మరోలా అన్నారు. నే విన్నది నిజమా? మీరు చెప్పింది నిజమా?"

ఈ సూటిప్రశ్నకు రేణుక సమాధానం చెప్పలేకపోయింది. దుఃఖం ముంచుకొచ్చింది.

తలవంచుకుని కన్నీరుకారుస్తున్న రేణుకనుచూసి హృదయం ద్రవించింది వేణుమాధవ్‌కు. ఆమె మనస్సును మరింత కష్టపెట్టినందుకు బాధపడ్డాడు.

నలుగురిలో నగుబాట్లు చేసి తనను వదలివెళ్ళిపోయిన శంకరాన్ని గురించిన ఆలోచనలో మునిగి పోయింది రేణుక.

ఆమె ఆలోచనలోనుంచి తేరుకొనేసరికి, ఎదురుగా వేణుమాధవ్ లేడు!

[సశేషం]

---

# తేనెటీగల భాష

## డాక్టర్ మహీధర నళినీమోహన్

కాశీ మజిలీ కథలలో మంత్రి కుమారుడికి పక్షులభాష తెలియడం, రాజకుమారుణ్ణి గండాలనుంచి కాపాడడం సర్వసాధారణం. అది నిజమో కాదో నాకు తెలియదుకానీ తేనెటీగల భాష తెలిసిన ఆసామీ ఒకడున్నాడు. ఆయన కారల్ వాన్ ఫ్రిష్ అనే జర్మన్ శాస్త్రజ్ఞుడు. ఆయన అనేక సంవత్సరాలపాటు తేనెటీగలకు స్వయంగా శుశ్రూష చేసి చాలా శ్రమపడి వాటిభాష నేర్చుకున్నాడు. ఆయన పరిశోధించిన విషయాలు వింటే నిజమా అని ఆశ్చర్యం కలుగుతుంది. 1914 వ సంవత్సరంనుంచీ ఆయన శాస్త్రీయ పత్రికలలో వ్రాసిన విషయాలను ఎత్తి రేఖామాత్రంగా సూచిస్తాను.

తేనెటీగల అలవాట్లను పరిశీలించడానికి అనువుగా గాజు తలుపులున్న పెట్టెలో తేనెపట్టు ఉంచాడు. ఆ పెట్టెకు చాలా దగ్గరలోనే తేనెగాని, పంచదార పానకంగాని ఉంచేవాడు. పెట్టెకు అంత దగ్గరలో ఆహారం ఉన్నా తేనెటీగలు దానిని చాలా సేపు గమనించేవే కావు. ఆఖరికి ఒక తేనెటీగ దానిని చూచి, పెట్టెలోకి ఎగిరివెళ్ళేది. త్వరలోనే వందలాది ఈగలు జుమ్ముమని అక్కడికివచ్చేవి. అంటే ఆ ఈగ మిగిలిన ఈగలకు ఆహారం సంగతి తెలియజేసిఉండాలి. ఏదిశలో, ఎంతదూరంలో, ఏరకమైన ఆహారం ఉందో తేనెటీగలు మాట్లాడుకోగలవా ? వాటి సంజ్ఞలు ఏమిటి ? ఈ విషయాలను గూర్చి ఆయన తీవ్ర పరిశోధనలు చేశాడు. మొట్టమొదటుగా ఆహారం దగ్గరకు వచ్చిన ఈగకు ఆనవాలుగా నీలి రంగు పూసేవాడు. ఆ ఈగ పెట్టెలో దూరి, తేనెపట్టుమీద గుండ్రని చక్రాలు చుడుతూ నృత్యం చేస్తున్నట్లు ఎగిరేది. అది ఎగిరేపద్ధతి ఒకటవ బొమ్మలో చూపినట్లుండేది. తాను పోగుచేసిన ఆహారాన్ని మిగిలిన ఈగలకు చూపించేది.



అంతలో పెద్ద షడ్చలనం బయలు దేరేది. మిగిలిన ఈగలు దానిని అనుకరిస్తూ నృత్యం చేసేవి. ఆనృత్యమేమిటి? భాష అయి ఉంటుందని ఫ్రిష్ ఊహించాడు.

నీలిగోరింటు పువ్వులమీద తేనె చిలకరించాడు. ముందుగా వాటి మీద వాలిన ఈగకు నీలిరంగు పూశాడు. అదిఎగిరి తేనెపట్టును చేరుకునేలోగా ఆపువ్వులు తీసేసి వాటి స్థానంలో తేనె వేయని మామూలు నీలిగోరింటు పువ్వులూ, వాటి పక్కనే బంతిపువ్వులూ ఉంచాడు. తేనెపట్టులో నుంచి ఈగలు ఎగిరి వచ్చి తెనెలేని నీలగోరింటు పువ్వులను శోధించడం మొదలు పెట్టేయి. బంతిపువ్వులవైపు చూడనైనా చూడ లేదు. తరువాత ప్రయోగం మార్చి బంతిపువ్వులమీద తేనె చిలకరించి వాటి ప్రక్కన తేనెలేని నీలిగోరింటులు ఉంచాడు. ఈసారి తేనె టీగలు నీలిగోరింటు పువ్వులను గమనించక, నేరుగా బంతిపువ్వుల మీదికి వెళ్ళేయి. ఇదే ప్రయోగాన్ని రకరకాల పువ్వులతో చేసి చూచాడు. వాసన ఏ మాత్రంలేని పువ్వుల విషయంలో మాత్రం తేనెటీగలు పొరబడ్డాయి. మిగిలిన అన్నిరకాల పువ్వులనూ అవి జాగ్రత్తగా వెతికి పట్టుకోగలిగేయి. ఒకసారి తేనెలో పిప్పర్‌మెంట్ ఆయిల్ కలిపి ఒక పువ్వుమీద చల్లేడు. ఒక ఈగ ఆ పువ్వుమీద వాలి, వార్త అందించ డానికి వెళ్ళిన సమయంలో ఆ పువ్వుని తీసేశాడు. తరువాత ఈగలు ఎగిరివచ్చి పిప్పర్‌మెంట్ వాసన ఉన్న ప్రతి వస్తువునూ వెతుక సాగేయి.

దీనినిబట్టి ఏం తెలిసింది? తేనె పట్టుదగ్గర గాలిలో గుండ్రని సున్నలు చుడుతూ నృత్యం చేయడంద్వారా ఆహారం అందుబాటులో ఉన్నదనీ, ఆ తేనెటీగ ఒంటినిపట్టిన వాసనను బట్టి ఏ పువ్వులో ఆహారం దొరికేదీ మిగిలిన ఈగలు గ్రహిస్తున్నాయన్న మాట.

మరో చిత్రమైన సంగతి ఏమిటంటే ఆహారం ఎంత ఎక్కువగా ఉన్నదీ, అది ఎంత తీపిగా ఉన్నది కూడా అవినృత్యం ద్వారా తెలుసుకుంటాయి! పంచదార పానకం చాలా తయారుచేసి ఉంచితే ఆ నృత్యం చాలా సేపు—ఉదయం నుంచి రాత్రిదాకా కూడా – కొనసాగింది. పానకం స్వల్పంగానే ఉంచితే వార్త అందించిన ఈగ కొంచెం సేపే నృత్యం చేసేది. పానకంలో పంచదార అధికంగా వేస్తే ఈగలు మరింత హుషారుగానూ, పంచదార తక్కువైతే కొంచెంసేపు మాత్రమే చప్పగా నృత్యం చేసేవి!

ఇంతవరకూ ఆహారం తేనె పట్టుకి దరిదాపులలోనే పెడుతూ వచ్చాడు ఫ్రిష్. తరువాత మెల్లి మెల్లిగా దూరం హెచ్చించి చూచాడు. 50 గజాల దూరం వరకూ చక్రాకారంలో నృత్యం కొనసాగింది. 50, 60 గజాలు దాటే సరికి సరి

కొత్త నృత్యం ఒకటి బయటపడింది. గుండ్రని నృత్యం మానేసి, ఎనిమిది ఆకారంలో (2వ బొమ్మలో చూపించినట్లు) తోక అటూ ఇటూ ఆడిస్తూ నృత్యం చేయసాగాయి! అంటే నృత్య భంగిమనుబట్టి ఎంత దూరంలో ఆహారం దొరుకుతుందో తెలుసుకుంటాయన్న మాట.

తరువాత దూరం ఇంకా హెచ్చించుకుంటూ పోయాడు ఏం జరుగుతుందో చూదామని. ఎంత దూరం వెళ్ళినా ఎనిమిది ఆకారంలోనే నృత్యం చేసే వేగం క్రమక్రమంగా తగ్గసాగింది. గడియారం దగ్గర పెట్టుకుని నిమిషానికి ఎన్ని ఎనిమిదులు చుట్టేయో లెక్క పెట్టేడు. ఈ సంఖ్యకూ ఆహారం దొరికే దూరానికి గ్రాఫ్ గీశాడు. ఆశ్చర్యకరంగా వంకరటింకరలు లేని చక్కని రేఖ వచ్చింది. ఉదాహరణకు 100 గజాల దూరంలో ఆహారం ఉంటే నిముషానికి 40 సార్లు ఎనిమిదులు చుడితే, 3000 గజాల దూరంలో నిమిషానికి 8సార్లు మాత్రమే ఎనిమిదులు చుట్టేయి!

ఫ్రిష్ పరిశోధనలు అంతటితో పూర్తికాలేదు. తేనెపట్టుకి 300గజాల ఉత్తరంగా పంచదార పానకపుగిన్నె పెట్టేడు. ఆ గిన్నెచుట్టూ పిప్పరమెంట్ ఆయిలు పూశాడు వాసనకి. గుర్తుపెట్టిన తొమ్మిది ఈగలను ఆ గిన్నెదగ్గర ఒక గంటసేపు పానకం తాగనిచ్చి వదిలి పెట్టేడు. తరువాత తేనెపట్టుకి అన్ని దిక్కుల



లోనూ అదే దూరంలో పిప్పర్‌మెంట్ ఆయిల్ పూసిన గిన్నెలు పెట్టేడు. ప్రతిగిన్నెదగ్గరా మనుష్యలను నిలువబెట్టి, వాటి దగ్గరకు వచ్చే ఈగలను లెక్క పెట్టించాడు. కొంతసేపు అయేసరికి ఉత్తరంగా ఉన్న మొదటి గిన్నెదగ్గరకు వందల సంఖ్యలో ఈగలు వచ్చిపడ్డాయి. మిగిలిన దిక్కులలో పెట్టిన గిన్నెల కేసి అసలు ఈగలు రానేలేదు! ఇదే ప్రయోగాన్ని దిశలు మార్చి వివిధ సమయాలలో, సూర్యుడు ఉన్నప్పుడు, మబ్బులు పట్టినప్పుడు— రకరకాలుగా చేశాడు. ఫ్రిష్ అన్ని ప్రయోగాలలోనూ తేనెటీగలు సరియైన స్థలాన్ని సునాయాసంగా వెతుక్కుంటూ వచ్చేసేవి. ఈ ప్రయత్నంలో ఆయన మరో చిత్రమైన విషయాన్ని కనిపెట్టేడు. ఆకాశంలో సూర్యుడు ఉన్న దిక్కునుబట్టి, సూర్యునికీ తేనెపట్టుకూ ఆహారానికీ మధ్యన ఉండే కోణాన్ని అనుసరించి




ఎనిమిది ఆకారపు నృత్యంలో సూక్ష్మమైన భేదాలు బయటపడ్డాయి. ఉదాహరణకి నాలుగు రకాల నృత్య భేదాలు 3 వ బొమ్మలో చూపబడ్డాయి. మొదటి ఈగచేసే నృత్య భంగిమనుబట్టి సూర్యుడు—తేనెపట్టు—ఆహారం—ఈ మూడు వస్తువుల మధ్య ఏర్పడే కోణం తెలుసుకోవచ్చు! ఆ కోణాన్నిబట్టి ఈగలు సరాసరి ఆహారం దగ్గరకు ఎగిరి వెళ్లగలుగుతాయి.

"తేనెటీగలు ఎంత చిత్రంగా మాట్లాడుకుంటాయో!" అని ముక్కు మీద వేలువేసుకోవలసి వస్తుంది, ఫ్రిష్ చేసిన పరిశోధనలు చూస్తే.

* * *

# అర్ధరాత్రి అగ్నిరాత్రి




పి. గంగాధరరావు నిర్మించిన హైదరాబాద్ మూవీస్ వారి "అర్ధ రాత్రి" ముఖ్యంగా స్త్రీ సమస్యా చిత్రం— లేడీస్ సబ్జెక్టు.

అసలే "అర్ధరాత్రి." అందులో ఆ నాలుగు అక్షరాలను మంటలతో చూపుతూవుంటే అది అపరాధపరిశోధక చిత్రంగా, దహన గాథగా పరిగణించ నవసరం లేదు. అర్ధరాత్రి అగ్నిరాత్రి. అగ్నికి కారణం ఎవరు? ఏయే శాంతి గుండెలకు అగ్ని రగిలింది? అవి దగ్ధమైనాయా, లేక అగ్నినుంచి పరిశుద్ధమై వెలువడిన బంగారంలా బైటపడ్డాయా? ఎవరివా శాంతి హృదయాలూ, ప్రేమ శరీరాలూ అన్నదే అనుక్షణ ఉత్కంఠ ప్రేరేపకంగా తెరపై పరుగులిడుతుంది.

స్త్రీ అసలే అబల. బాల్యంనుంచి అన్యాయాలు. అందులో తల్లి దండ్రులు లేనివారి సంగతేమిటి? ఆ స్త్రీవుండీ "అడవిపాలై" అడవికాచిన వెన్నెల వంటి ఒక యువధనికుని పంచచేరి, అడవిని ఆనందసీమచెయ్యబోతే ఉన్న వెన్నెలపోయి ప్రతి అర్ధరాత్రి అగ్నిరాత్రి అయింది. అబల సరళ (భారతి), ధనిక యువకుడు శ్రీధర్ (జగ్గయ్య). వారి ప్రేమరాత్రి ఎగసిన జ్వాలలు ప్రేమను దహించి వేయలేదు. దగ్ధం చేసి వేయలేదు. అగ్నినుంచి వెలువడినది. వారి పరిశుద్ధమైన ప్రేమ స్వర్గం.

కథ కొత్త ప్రయోగం వంటిది. రచన ఆరుద్ర. సాంఘికం సెంటిమెంట్ వుండి, డిటెక్టివ్ సస్పెన్స్ థ్రిల్ వుండి వీటికి కొత్త జీవమిచ్చే కొత్త తారలూ వున్నారు (రాధిక, ఒక విధంగా భారతి), కొత్త దర్శకుడూ (పి. సాంబశివరావు) వున్నారు.

## "ఉమ్మడి కుటుంబం"లో చతుర్విధ తత్వాలు

ఎన్.ఏ.టి, రామకృష్ణ కంబైన్స్ వారి "ఉమ్మడి కుటుంబం" కేవలం నలుగురు అన్నదమ్ములకథమాత్రమే కాదని, నాలుగు తత్వాల మధ్య సంఘర్షణ కథలో బలీయమైన అంశమని తెలుస్తున్నది. యోగానంద్ ఈ చిత్రం దర్శకుడు. రామారావు ముఖ్య భూమికను ధరిస్తున్నారు.



# అంజలి 124

అంజలీదేవి రెండు దశాబ్దాల సినీ జీవితంలో 124 తెలుగు, తమిళ, హిందీ చిత్రాలలో నటించిన సందర్భం పురస్కరించుకొని ఆమె చిత్రపట ప్రదర్శనం, దానితోపాటు సుఖదుఃఖ ప్రసంగ ప్రదర్శనం జరిగాయి.

రిపబ్లిక్ దిన్నానవెన్నెలరాత్రిఅంజలి భవనం చలువరాతి శివపార్వతి విగ్రహాలముందు ఆ రెండూ జరిగాయి. "గొల్లభామ"తో ప్రారంభమైన పటం, "మహాత్మాఉదంగర్"తో ఒక మలుపు, ఒక హిందీ చిత్రంతో మరొక హృదయంగమమైన మలుపు తిరిగి, "రంగులరాట్నం" తో కామా వేసింది. ఫుల్‌స్టాప్ పడకూడదనేఆశాభావాన్ని అనాటి పత్రికా ప్రతినిధుల సమావేశంలో వక్తలు వ్యక్తం చేశారు.

అంజలి తన భర్త ఆదినారాయణ రావుగారికి, తనకు చలనచిత్ర యోగం కల్పించిన చిత్తజల్లు పుల్లయ్య గారికి, తన లక్ష్మికి తోడైన సరస్వతులకు (పత్రికలు – పత్రికా రచయితలు) కృతజ్ఞతాంజలి ఘటించారు.

సినిమా జీవితంలో సుఖదుఃఖాలున్నాయన్నారు. సాధించిన డబ్బుకంటె కీర్తి నిలుస్తుందన్నారు. సమయస్ఫూర్తితో సోపానాలువేసుకోవాలి అంటే పత్రికల విమర్శలను సహృదయంతోస్వీకరించడం అవసరమన్నారు. తన కళాకీర్తికి కారకులైన సినిమా నిర్మాణ రంగం వారికి, ప్రేక్షకులకు ధన్యవాదాంజలి ఘటించారు.

తెలుగు పత్రికల తరపున ఆంధ్రా ఫిలిం జర్నలిస్టుల సంఘం అధ్యక్షుడు శ్రీ బొమ్మకంటి సుబ్బారావు ప్రసంగిస్తూపత్రికల,సినిమాపరిశ్రమపరస్పర సహకారం ఉభయులకూ శ్రేయోదాయకరమన్నారు. వదినగారి గాజులు ఇలవేలుపు, కులదైవం, శ్రీలక్ష్మమ్మకథ, అంజలి లక్ష్మిని మించిన కీర్తిచంద్రికలన్నారు.

పాత్రోచితనటనే కాక ఉత్తమ పాత్ర రీతులను నిజ జీవితపు రీళ్ళలో అంజలి ప్రదర్శించిందని ఆంగ్ల పత్రికల తరపున రాఘవన్ మాట్లాడుతూ అన్నారు.

తమిళ పత్రికల తరపున నారదర్



భరణీవారి "గృహలక్ష్మి" చిత్రంలో నాగేశ్వరరావు, పద్మనాభం

శ్రీనివాసరావు మాట్లాడుతూ తమిళ కళారంగానికి సేవచేసిన అంజలి తమిళ నటునితో (సారంగపాణి) వియ్యమొందడం భారత భావైక్యతకై (నేషనల్ ఇంటిగ్రేషన్) ఒక అంజలి అన్నారు.

వయసును, ఆకృతిని అనుక్షణం తెలుసుకొంటూ వాటికి అనుగుణమైన భూమికలనే ధరిస్తున్న అంజలి మరిరెండు దశాబ్దాలు నిలవగలదు.

## "లేత" వారి మూడవ "యుగము"

నవయుగ అధ్వర్యాన 17 కేంద్రాలలో 100 రోజులకు పైగా నడచి, రాజధానిలో రజతోత్సవం జరుపుకొనబోతున్న ఏ. సి. ఎమ్. ప్రొడక్షన్స్ 'లేతమనసులు' శతదినోత్సవ షీల్డు బహూకరణోత్సవం ఫిబ్రవరి ఒకటవ తేదీ రాత్రి ఏ. వి. ఎమ్. స్టుడియోస్ ఆవరణలో జరిగింది. లేత వారితో, అనగా మామూలు తారాగణంతో తమిళంలో, తెలుగులో తీసిన ఈ చిత్రం మూడవయుగం హిందీలోకి వెళ్ళబోతున్నది.

ఆనాటి బహూకరణోత్సవానికి మద్రాసు హైకోర్టులోని ఆంధ్ర న్యాయమూర్తి శ్రీ టి. రామప్రసాదరావు అధ్యక్షత వహించారు. వేదికపై నవయుగ శ్రీనివాసరావు, చంద్రశేఖరరావు, ఏ. వి. మెయ్యప్పన్ ఆసీనులైనారు. దర్శకద్వయం

లోని పంజా కార్యక్రమ నిర్వహణా భారం వహించారు. ఎస్. జానకి ప్రార్థన గీతానంతరం ఏ. వి. మెయ్యప్ప చెట్టియార్ స్వాగతం చెబుతూ "లేతమనసులు"నుహిందీలో కూడా తీయబోతున్నామన్నారు.

తెలుగులో సామాన్య తారా గణం కల చిత్రం 17 కేంద్రాలలో నూరు రోజులకు పైగాను, రాజధానిలోనే 25 వారాలకు పైగాను వెళ్ళడం ఇదే మొదలు అనిఅన్నారు. ఈ విజయోత్సాహంతో తెలుగులో పరంపరగా చిత్రాలు తీయబోతున్నా నన్నారు.

శ్రీ రామప్రసాదరావు "లేత మనసులు" యూనిట్‌కు షీల్డ్‌లు బహూకరించారు.

షీల్డ్‌లు అందుకొన్న తారలలో ఇద్దరు థియేటరు యజమానులు. ఒకరు రేలంగి, మరొకరు నెల్లూరు కాంతారావు.

రేలంగి తన "రేలంగి చిత్ర మందిర్" (తాడేపల్లిగూడెం) తరఫున శ్రీ వెంకటేశ్వరస్వామి వెండి పెద్ద ఫోటోను ఏ. వి. మెయ్యప్పన్‌కు బహూకరించారు.

పంజా తెలుగులో వ్రాయబడిన వాక్యాలను తన ప్రసంగంగా తెలుగులో చదువుతూ ఈ ఉత్సవం కళ భాషా ప్రాంతీయ భేదాలకు అతీతమని రుజువు చేస్తున్న దన్నారు.

శ్రీ రామప్రసాదరావు మాట్లాడుతూ తెలుగు నాట, తమిళనాట వినోద విజ్ఞానాలకు సంకేతాలుగా నిలచిన. ఏ. వి. ఎమ్ పరంపరగా చిత్రాలు తీయాలనే ఆశీస్సు పలికారు.

ఈ వుత్సవానికి ఆంధ్ర, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ ఫిలిం రంగాలకు చెందిన వారు కూడా రావడం ఒక విశేషం.

బేబిపద్మిని ఆహూతులకు చందన మిచ్చింది.

## "పూలరంగడు" కొత్తవిలను

అన్నపూర్ణా పిక్చర్స్ వారు "పూలరంగడు"లో భానూప్రకాష్ అనే నటుని దుష్ట పాత్రలో వెండి తెరకు పరిచయం చేస్తున్నారు. వయసు తక్కువైనా కౌమారంలో వున్నట్లు కనిపించే ఈ రాజధాని స్టేజినటునిపై ఈవరకే చిత్రీకరణ జరిగింది. ఎక్కువభాగాలలో ఈయన గుమ్మడితో నటిస్తున్నారు గుమ్మడికి పక్కలో బల్లెంవంటి భూమికను భానూప్రకాష్ నిర్వహిస్తున్నారు. "పూలరంగడు" వెండి తెరకు ము ప్పాళ రంగనాయకమ్మను (సంభాషణల రచయిత్రి), మోహన్ రాజును (రాజధాని గాయకుడు) పరిచయం చేస్తున్నది. జనవరి మాసాంతంలో మద్రాసులో ఘంటసాల ఒక్కరూ పాడిన పాటను, మాధవపెద్ది సత్యం, వసంత



## హైదరాబాద్ మూవీస్‌వారి
## "అర్థరాత్రి"లో భారతి, జగ్గయ్య, రాధిక

యుగళ గీతాన్ని రికార్డు చేశారు. ఫిబ్రవరి రెండవ తేదీ నుంచి 12 వ తేదీ వరకు హైదరాబాద్ శ్రీ సారథి స్టుడియోస్‌లో జరిగిన షూటింగ్‌లో నాగేశ్వర రావుపై ఘంటసాల పాట చిత్రీకరించారు. మరికొన్ని సన్నివేశాలను కూడా 'షూట్' చేశారు. చిత్ర సంగీత దర్శకుడు ఎస్. రాజేశ్వర రావు. ఛాయాగ్రహణ దర్శకుడు సెల్వరాజ్. దర్శకుడు ఆదుర్తి. నిర్మాత దుక్కిపాటి మధుసూదన రావు.

ఫిబ్రవరి ద్వితీయార్ధంలో మద్రాసులో మరికొన్ని పాటల రికార్డింగ్ జరుగుతున్నది. మార్చిలో బహుశా షూటింగ్ షెడ్యూలు వుండదు. అన్నపూర్ణా సంస్థ కెమెరామన్ సెల్వరాజ్‌ను నందనా వారి "సాక్షి" పనికివదిలేస్తారు. మళ్ళీ ఏప్రిల్‌లోనే "పూలరంగడు" కెమెరాముందు నిలుస్తాడని తెలుస్తున్నది. కథకుడు: ముళ్ళపూడి.

## చలన చిత్ర వార్తలు

### 'చక్రవర్తి చిత్ర'

ప్రయోజనాత్మక చిత్ర నిర్మాణానికై అక్కినేని నాగేశ్వరరావు, ఆదుర్తి సుబ్బారావు నెలకొల్పిన చక్రవర్తి చిత్రసంస్థ దాదాపు 70-80 కథలను ఎన్నిక నిమిత్తం పరిశీలించి నట్లు తెలుస్తున్నది తమ ఆశయాలకు తగిన కథను తగు సమయంలో ఎన్నుకొని చిత్ర నిర్మాణానికి ఉప క్రమించగలరని తెలుస్తున్నది "స్లో అండ్ స్టెడీ విన్స్‌ది రేస్" అనేది అక్కినేని, ఆదుర్తి ప్రస్తుత సూత్ర మని అభిజ్ఞవర్గాలలో అనుకొంటు న్నారు



"ఇద్దరు మొనగాళ్లు" చిత్రంలో కృష్ణకుమారి

### ఆదుర్తి చిత్రాలు

ప్రసాద్ ప్రొడక్షన్స్‌వారు ఆదుర్తి దర్శకత్వంలో రూపొందించిన హిందీ మూగమనసులు "మిలాన్" మార్చి ద్వితీయార్థంలో విడుదల కాబో తున్నది ఈ ఈస్ట్‌మన్ కలర్ చిత్రం ప్రోసెసింగ్ అంతా బొంబాయిలో జరిగింది పి ఎల్ రాయ్ ఛాయా గ్రహణ దర్శకత్వం వహించారు. కొమ్మన రామకృష్ణారావు ముఖ్య సహాయకుడు. తెలుగు గడ్డపై ఎక్కువగా తీసిన మొట్టమొదటి హిందీ కలర్ చిత్రం ఇది.

జనవరి మాసాంతంలో మద్రాసులో ఒకటి రెండు రోజుల పాటు ఔట్‌డోర్ షూటింగ్ జరి గింది.

ఆదుర్తి మరొక చిత్రం బాబూ మూవీస్ వారి 'విశాల నేత్రాలు' షూటింగ్‌కు అంతా సిద్ధమైంది కాని నాయిక ఎన్నికే పూర్తికాలేదు. సువిశాల నేత్రాలుకల కొత్తనటి కోసం ఆదుర్తి జరిపిన అన్వేషణ యింకా ఫలించలేదు నాయికభూమి కకు దాదాపు 250 దరఖాస్తులు వచ్చాయి కాని, అందులో ఏ నేత్ర



భరణీవారి "గృహలక్ష్మి" చిత్రంలో
ఎస్. వి. రంగారావు, భానుమతి, సూర్యకాంతం

ద్యయమూ ఆదుర్తికి నచ్చలేదు. సంకల్పానికి తగిన సత్ఫలితంకోసం ఆదుర్తి ఎదురుచూస్తున్నారు.

### "కృష్ణుని ఛాంబర్"

తారకరామా పిక్చర్స్‌వారి "శ్రీ కృష్ణావతారం"లో ఫిబ్రవరి నెలలో కృష్ణుని ఛాంబర్‌పై చిత్రీకరణ జరుగుతున్నది. ఇప్పటికి ఎనిమిది ఎడిటెడ్ రీళ్ళు తయారైనాయి. ఒకేసారి ఫైనల్ ఎడిటింగ్ చేస్తున్నారు. కచ్చాపచ్చీగా కాక అంతా ఒక క్రమ పంథాతో చిత్రనిర్మాణం సాగడం ఈ సంస్థ విశిష్టతగా చెప్పుకుంటున్నారు. లోగడ "రేచుక్క"లో ఒక పాటను 72 సంగీత వాద్యాలతో రికార్డుచేసి నందమూరి త్రివిక్రమరావు, టి. వి. రాజు తెలుగు రంగానికి రికార్డ్ సృష్టించారు. ఇప్పుడు "శ్రీ కృష్ణావతారం"లో నాలుగంటే నాలుగు వాద్యాలతో సుశీల పాట రికార్డుచేసి తక్కువ వాద్యాలలో రికార్డు నెలకొల్పారు. సుశీల ఆ పాట పాడారు. టి. వి. రాజు సంగీత దర్శకత్వం వహించారు. జాంబవతి (సుకన్య)పై ఆ పాటను చిత్రీకరించారు. చిత్ర దర్శకుడు కమలాకర కామేశ్వరరావు.

### "వస్తాడే మా బావ!"

పాట చరణాన్ని చిత్రానికి పేరుగా పెట్టడం జరిగింది. అలనాటి

వాహినీ "సుమంగళి"లో మాలతిపై చిత్రీకరించిన "వస్తాడే మా బావ" చరణభాగం ఒక హైదరాబాద్ సంస్థ తన చిత్రానికి పేరుగా పెట్టుకుంది. వేణు ఫిలింస్ అనే హైదరాబాద్ సంస్థ పైచిత్రాన్ని నిర్మించేందుకు సన్నాహాలు జరుపుతున్నది.

## "చిక్కడు, దొరకడు

శ్రీ లక్ష్మీనారాయణ ప్రొడక్షన్స్ అనే మద్రాసు సంస్థ "చిక్కడు-దొరకడు" అనే జానపద చిత్రం నిర్మించబోతున్నది. దర్శకుడు విఠలాచార్య. ముఖ్య పాత్రధారి రామారావు. కథ, సంభాషణలు: వీటూరి. సంగీతం: టి. వి. రాజు.

## "ముగ్గురు మరాఠీలు"

అశ్వరాజ్ వారు "ముగ్గురు మరాఠీలు" జానపద చిత్రం నిర్మిస్తున్నారు. నాయకుడు ఎన్. టి. రామారావు. సముద్రాల పాటలు, మాటలు సమకూర్చుతున్నారు.

స్క్రీన్ప్లే: కె. గోపాలరావు.

## రంగారావు ద్విపాత్రాభినయం

బి. ఆర్. ఫిలింస్ అనే తెలుగువారి (మద్రాసు) మిస్టరీ చిత్రంలో ఎస్. వి. రంగారావు ద్విపాత్రాభినయం చెయ్యబోతున్నారు. స్వంత చిత్రం "చదరంగం" ఒక దారిన పడగానే ఈ చిత్రానికి ఆయన కాల్ షీట్లు యివ్వగల రనుకొంటున్నారు.

యూనిట్ వివరమిది: నిర్మాత బి.వి. రామారావు. నిర్మాణ నిర్వహణ "చిత్ర" నరసింహారావు. రచన చారిత్రక నవలా రచయిత పాలప ...ప్రసాద్ (జర్నలిస్టు). దర్శకుడు కె. శ్రీనివాసరావు, ఛాయాగ్రహణం : ఎస్. ఎస్. లాల్, సంగీతం ఎస్. రాజేశ్వరరావు, ఎస్. రామలింగేశ్వరరావు. పాటలు : డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఆరుద్ర. కళ : సోమనాథ్. తారాగణం : రామమోహన్, కృష్ణ, రాజశ్రీ, చదలవాడ, రాజబాబు, ఇద్దరు రంగారావులు. రికార్డింగ్ దశ ప్రారంభమైంది.

## మహారాష్ట్ర దర్శకుని చిత్రంలో రామారావు

తమిళ చిత్రరంగంలో పేరు ప్రఖ్యాతులు వహించిన మహారాష్ట్ర దర్శకుడు దాదామిరాసి దర్శకత్వం వహిస్తున్న తెలుగు చిత్రంలో (సాంఘికం) ఎన్.టి. రామారావు ముఖ్య భూమిక ధరిస్తున్నారు. కథ చెప్పడంలో బహునేర్పరి అయిన మిరాసీ తెలుగుచిత్రంలో యింకారంగారావు, పండరీబాయి, కృష్ణకుమారి, శోభన్ బాబు మొదలైనవారు నటిస్తున్నారు. సహకార దర్శకుడు చెరువు ఆంజనేయశాస్త్రి. ఇదే చిత్రాన్ని హిందీలో శ్రీధర్ డైరెక్ట్ చేస్తున్నారు. బిశ్వజిత్, మాలాసిన్హా, అశోక్ కుమార్, రాజ్ కుమార్ తారాగణంలో కలరు.



గౌతమి పిక్చర్స్‌వారి "నిర్దోషి" చిత్రంలో
సత్యనారాయణ, పద్మనాభం, గీతాంజలి

### "భువనసుందరి కథ"

శ్రీదేవి ప్రొడక్షన్స్‌వారి హాస్య జానపదం "భువనసుందరి కథ" నిర్మాణం పూర్తి కావస్తున్నది. ఏప్రిల్ ఏడవ తేదీన విడుదలయ్యే ఈచిత్రం జి. వి. జి. ని సినీకథకునిగా పరిచయం చేస్తుంది. రామారావు, కృష్ణకుమారి ముఖ్యభూమికలు ధరించిన ఈ హాస్య శృంగార, వీరరస ప్రధాన చిత్రందర్శకుడు సి.పుల్లయ్య నిర్మాత: తోట సుబ్బారావు.

### తెలుగులో "కైకుడుత్త దైవం"

కె.ఎస్. గోపాలకృష్ణన్ తమిళంలో తీసి ఢిల్లీ సత్కారం పొందిన "కైకుడుత్త దైవం" అనే తమిళ చిత్రాన్ని సుందరలాల్ నహతా, డూండీలు తెలుగులో పునర్నిర్మిస్తు

న్నారు 'ఆ ప ద లో ఆదుకొన్న దేవుడు' అనేఅర్థంవచ్చే ఆచిత్రంలో తెలుగు భాషా మాధుర్యంపై సుబ్రహ్మణ్యభారతి రచించిన తమిళపాట వుంది. ఈ సంచిక వె లు వ డే సరికి తెలుగుచిత్ర నిర్మాణం ప్రారంభమై వుంటుంది. తమిళంలో శివాజిగణేశన్ ధరించిన పాత్రను తెలుగులో కృష్ణ, రాజేంద్రన్ ధరించిన భూమికను "రంగులరాట్నం" చంద్రమోహన్ నిర్వహిస్తున్నారు. కాంచన, కృష్ణకుమారి, సంధ్యారాణి, వా ణి శ్రీ ఇతర ముఖ్యతారలు· రచన: భమిడిపాటి, దర్శకత్వం: రామచంద్రరావు.



ఇందిరా ప్రొడక్షన్స్‌వారి 'రతీ మన్మధ'లో జి. వరలక్ష్మి

## 'ప్రాణ మిత్రులు'

పద్మశ్రీవారు'ప్రాణమిత్రులు'లో ఒకటి రెండు ఘట్టాలను ఇటీవల విశాఖపట్టణంలో చిత్రీకరించారు. గీతాంజలి, జగ్గయ్యలపై ఒకపాట చిత్రీకరించారు. మార్చి మాసాంతంలో విడుదలయ్యే ఈ చిత్రంలో నా గే శ్వ ర రా వు, సా వి త్రి, కాంచన, గుమ్మడి, రావి కొండలరావు, రేలంగి, ఏ. వి. సుబ్బారావు, గిరిజ, చదలవాడ మొదలైనవారు నటిస్తున్నారు. ఈ చిత్రంలోని భూమికపై నాగేశ్వరరావుకు ప్రత్యేకాభిమానం కలదని ప్రత్యేక వార్త. ముఖ్య సాంకేతికవర్గం: వి. వెంకటేశ్వర్లు, పి. పుల్లయ్య, ముళ్ళపూడి వెంకటరమణ, ఆత్రేయ, దాశరథి, డాక్టర్ సి. నారాయణరెడ్డి, కె. వి. మహాదేవన్, సెల్వరాజ్, ఎన్.ఎమ్.శంకర్.

## రోజా రమణికి హిందీ పాతాలు

"భక్తప్రహ్లాద"లో ప్రహ్లాదునిగా నటించిన చిన్నారిపాప రోజా రమణి. ఏ. వి. ఎమ్ వారు భీమ్‌సింగ్ దర్శకత్వంలో ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న హిందీ ఆ త్తబంధువులోనూ నటిస్తున్నది. రంగారావు భూమికను అశోక్‌కుమార్ ధరిస్తున్నారు. అశోక్ కుమార్‌కు ఇప్పుడు రోజారమణి అంటే ప్రాణం. ఏ. వి. ఎమ్. అధిపతి మెయ్యప్ప చెట్టియార్ ఈ బేబీకి హిందీలో ప్రత్యేక తరగతి పెట్టారు. 'లేతమనసులు' హిందీలో రాబోతున్నది.



వాసు మూవీస్‌వారి "మా వదిన" చిత్రంలో

సూర్యకాంతం, మాస్టర్ బాబు, మల్లిక

శరత్‌బాబు "రామేర్ సుమతి" ఆధారంగా వాసూ మూవీస్ వారు కె. ప్రత్యగాత్మ దర్శకత్వంలో రూపొందిస్తున్న "మా వదిన" లో ఫిబ్రవరికి వారంరోజుల ఔట్‌డోర్ షూటింగ్ మాత్రం మిగిలివుంది. ఈ సంచిక వెలువడే సరికి ఆ కార్యక్రమంకూడా పూర్తి అయివుంటుంది. కృష్ణకుమారి, బాబు, మారుతి, మల్లిక, కాంతారావు, రంగారావు, ప్రభాకర రెడ్డి మొదలైనవారు తారాగణంలో కలరు. రచన: మద్దిపట్ల సూరి

